
శుభోదయ వారి...
"ఆదర్శం"

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.



సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 44
సంచిక 49
13-8-52

నందన శ్రావణ బహుళ అష్టమి బుధవారము

రిపబ్లిక్ అధ్యక్ష ఉపాధ్యక్షులు, ప్రధానమంత్రి.

[గాంధీజీ, నెహ్రూ చిత్రాలను 4, 5 పేజీలలో చూడండి.]

# చేదెక్కిన స్వాతంత్ర్యమా?

"స్వాతంత్ర్యం" పేరు చెప్తే కొందరు నిర్లక్ష్యభావంతో పెదవి విరుస్తారు; కొందరు హేళనచేస్తారు; కొందరు ఆశాభంగం పొందినట్లు దీర్ఘనిశ్వాసం విడుస్తారు; ఇదంతా మోసమన్నట్లు కొందరు ఆవేశానికి లోనౌతారు. కొందరు పూర్వస్మృతులతో ఉక్కిరిబిక్కిరౌతారు.

కాని అందరూ 1947 వ సంవత్సరంలో 15 వ తేదీని ఏదో ఉన్నతిని సాధించినట్లు గర్వించారు. కలవారూ లేనివారూ కూడా కొద్దిగానో గొప్పగానో పండుగ చేసుకున్నారు. పండుగ చేసుకోడానికి బొత్తిగా తాహతులేనివారు సహితం దేశంలో ఎల్లెడలా వ్యాపించిన సంతోష ఉత్సాహాలను చూసి మురిసిపోయారు. జాతి కుల మత భేదాలతో గాని వర్గవైషమ్యాలతో గాని నిమిత్తం లేకుండా యావన్మందీ దృష్టిగోచరం గాని ఏదో మహత్తరఫలాన్ని అనుభవిస్తున్నట్లు ఆనందించారు.

అయితే ఆనాటి ఆగస్టు 15 కీ, అయిదేళ్ల అనంతరం ఈ ఆగస్టు 15 కీ ఇంత వ్యత్యాసం ఎందుకొచ్చింది? పండుగలు పాతబడిపోవడమనేది మన దేశంలో ఎన్నడూ లేదు. దీపావళి మొదలైన పండుగలు నిత్యనూతనమైనవి. పూర్వంనుంచి ప్రజల కెంత ఆనందం చేకూర్చుతున్నాయో ఇప్పుడూ అంతే ఆనందం చేకూర్చుతున్నాయి. అయినా స్వాతంత్ర్య దినోత్సవానికి మొదటి ఉల్లాసం, ఆనందం ఈనాడు కనిపించడం లేదు.

ఒక విధంగా చూస్తే దేశం "స్వాతంత్ర్యాన్ని" ఆనందంతో అనుభవించినది 1947 ఆగస్టు 15 వ తేదీని ఒక్క రోజునే అనిపిస్తుంది. తరవాత ఆ "స్వాతంత్ర్యం" వంటిదే ఒక "హక్కు" లభించినట్లు సర్వజనులకూ అనుభవమైనది ఈ సంవత్సరారంభంలో జరిగిన ఎన్నికలలోనే. ఆ "స్వాతంత్ర్యం" మాదిరిగానే, ఈ సార్వజనీనమైన "వోటింగ్ హక్కు" కూడా మాయలేడి మాదిరి ఒకసారి కనిపించి అంతలోనే మాయమైనట్లు అది ఏదో కంటికి కగుపించని ఫలమన్నట్లు ప్రజలకు ద్యోతకమయింది. తరవాత తెల్లవారగానే తిరిగి జీవితం మామూలుగానే సాగిపోనారంభించింది

అయితే స్వాతంత్ర్య లబ్ధికి పూర్వానికీ, తరవాతకీ నిజంగా వ్యత్యాసమే లేదా? ఏదైనా వ్యత్యాసముంటే, అది ప్రజలకు నిత్యజీవితంలో ఎలా అనుభవానికి వస్తున్నది?

స్వాతంత్ర్యం లభించినదంటే స్వర్గం అవతరిస్తున్నదని అపోహపడినవారికి ఆశాభంగం కలిగిన మాట వాస్తవమే. జాతి అభ్యుదయానికి అడ్డుగోడగా నిల్చిన పరాయిప్రభుత్వం తొలగడంతోనే జాతి అభ్యుదయం అరచేతిలో పడలేదు. ఒక ప్రతిబంధకం, మాత్రం తొలగిపోయింది. ప్రజానీకంపై గల ఒక మహాభారం తొలగిపోయింది. జాతి అంతా చెరసాలనుంచు విడుదలైనట్లు తోచింది. దేశీయ సంపదను పరులు ప్రత్యక్షంగా దోచుకోడం నివారించబడింది. ఆ తదుపరి కర్తవ్యం ఎంతటి భారవంతమైనదో పూర్తిగా గ్రహించినది ఏ కొద్దిమంది నాయకులో ఉంటారు. అయితే స్వాతంత్ర్యలబ్ధితోపాటు దేశవిభజన, మత కల్లోలాలు, ఆ పైన జాతిజనకులైన గాంధి మహాత్ముని హత్య ప్రజలముందు ప్రత్యక్షమైనాయి. ఆర్థికస్థితి నానాటికి హీనస్థితికి రానారంభించింది. ప్రజల నిత్యజీవితం మరింత దుర్ఘటమౌతూ వచ్చింది.

"స్వాతంత్ర్య" మనేది ప్రజలకు అనుభవంలో కేవలం ఊహామాత్రమే కాగా, జీవితంమాత్రం భారవంతమై కనపడింది. లభించినస్వాతంత్ర్యం సంరక్షించుకోడమే ప్రధానసమస్యగా పరిణమించగా కాంగ్రెస్ నాయకులు తమ యావచ్ఛక్తినీ అందుకే వినియోగించవలసి వచ్చింది. బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలలో ప్రజలకు స్వాతంత్ర్యం దుఃఖదాయకమయ్యింది. ఉత్తరాదిని భయంకర హత్యాకాండ చెలరేగింది.

అందువల్లనే స్వాతంత్ర్యమనేది కొందరికి కొంపలుకూల్చినదిగా కనబడితే కొందరికి బంధుమిత్రాదులకు వేరుచేసినదయింది; కొందరికి మోసంగా కనపడింది. కొందరికి—కొద్దిమందికి మాత్రం—కొండంత లాభాలు చేకూర్చినదయింది. కొందరికి రాజకీయ జీవనమనే కొత్తవృత్తి లభింపచేసింది. కాని వారివారి కష్టసుఖాలకు కాని లాభనష్టాలకు కాని "స్వాతంత్ర్యమే" కేవలం కారణం కాదని ప్రజలు స్పష్టంగా గ్రహిం

---

# విజయదశమికి ప్రత్యేక సంచిక

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక రాబోయే విజయదశమికి (సెప్టెంబరు 28) పిల్లల ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. బాలబాలికలకు ఉల్లాసం, విజ్ఞానం కలిగించే చక్కని కథలతో, పాటలతో, వ్యాసాలతో, బొమ్మలతో ఆకర్షణీయంగా తయారవుతుంది. రచనలు పంపగోరువారు ఆగస్టు నెలాఖరులోగా మా కార్యాలయానికి అందేలాగ పంపాలి.

పిల్లలరచనా శక్తిని, చిత్రలేఖనశక్తిని ప్రోత్సహించే ఉద్దేశ్యంతో పోటీకూడా ప్రవేశపెట్ట దలిచాము. పదిహేనేళ్ల లోపు బాలబాలికలుమాత్రమే ఈ పోటీలోపాల్గొనాలి. పోటీకివచ్చినవాటిలో ఒక మంచికథకు, ఒక మంచిపాటకు, ఒక మంచి బొమ్మకు బహుమతు లివ్వబడతాయి. రచనలు స్వతంత్రంగా ఉండాలి. రచయితలు తమవయస్సు, చిరునామా వివరంగా రాయాలి. పోటీకొరకు రచనలను, బొమ్మలను పంపేవారు; కవర్లపైగాని; లోపల వేరే కాగితంపైనగాని "పోటీకొరకు" అని స్పష్టంగా వ్రాయాలి.

—సంపాదకుడు

చడం లేదు. స్వాతంత్ర్యంతో పాటే ఈ స్వాతంత్ర్యాన్ని తెచ్చిపెట్టిన కాంగ్రెస్ సంస్థకూడా కొందరికి చేదెక్కింది. స్వాతంత్ర్యంవల్ల కష్టనష్టాలు కలిగినాయని ఎలా భ్రమపడుతున్నారో, అదేరీతిగా కాంగ్రెస్‌వల్లనే కష్టనష్టాలు సంభవిస్తున్నాయనికూడా అనేకులు అపోహ పడుతున్నారు.

స్వాతంత్ర్య లబ్ధికి పూర్వంకంటె ఇప్పుడు జీవనం కష్టతరమైనమాట నిజమే కావచ్చు. కాని మనదేశమే కాదు యావత్ప్రపంచమూ క్లిష్టమైన ఆర్థికహైన్యంలో చిక్కుబడిఉన్నదని మరిచిపోకూడదు. స్వాతంత్ర్యం లభించిఉన్నా, లేకపోయినా, ప్రభుత్వాధికారం కాంగ్రెస్‌వారి చేతిల్లో ఉన్నా మరొకరిచేతిలో ఉన్నా ఈ ఆర్థికధైన్యం ప్రపంచ పరిస్థితుల దష్ట్యా అనివార్యం కాకతప్పదు. ఏ పార్టీ అధికారంలో ఉన్నప్పటికీ స్వాతంత్ర్య సంరక్షణకోసం దేశరక్షణకోసం పాటుపడక తప్పదు. ఏ పార్టీ పరిపాలిస్తున్నప్పటికీ ప్రజలఅసంతృప్తికి గురికాక తప్పదు.

ఉద్యోగులు, వ్యాపారులు, రాజకీయవాదులు అవినీతి పరులై సంచరిస్తున్నారనీ, ఇందుకు కాంగ్రెస్ పరిపాలనే హేతువనీ ఒక అభిప్రాయం ప్రబలిపోయింది. ఇతర ప్రజాస్వామ్య దేశాలను గమనించినట్లయితే అవినీతి విషయంలో ఏ దేశమూ మనదేశానికి తీసిపోదని గ్రహించవచ్చును. ప్రజల సంపూర్ణచైతన్యంపైనే ప్రజాస్వామ్యం ఆధారపడిఉంటుంది. ఈ నాటికీ ఇతర ప్రజాస్వామ్య దేశాలలో ఇది సాధ్యపడలేదు.

ఆనాటికీ ఈ నాటికీగల వ్యత్యాసంలో ప్రజల కష్టాలు, ఆర్థికహైన్యం అవసరవస్తువులకు కరువులు మాత్రమే ప్రజలకు ప్రత్యక్షంగా గోచరిస్తున్నందువల్ల స్వాతంత్ర్యం చేదుచేదుగా ఉంది. అయితే మరొక ముఖ్య వ్యత్యాసం అట్టే గుర్తించబడ్డంలేదు. ప్రజలను ప్రభుత్వాధికారం నుంచి దూరదూరంగా ఉంచే పరిపాలనా యంత్రాంగాన్ని ప్రజలకు సన్నిహితంగా తెచ్చి వారి హక్కులను తెలియపరచగల రాజకీయ చైతన్యం క్రమక్రమంగా వృద్ధి చెందుతోంది. అయితే పరిస్థితులు అనుకూలిస్తున్నందువల్ల ప్రజలను మోసపుచ్చే కొందరు రాజకీయవాదులమూలంగా ఈ కార్యకలాపం ధనార్జన కొక వృత్తిగా మారినమాట నిజమే. కాని ఈ నిరోధాలకు ఆగేదికాదు అభ్యుదయం. ప్రజలు చైతన్యవంతులౌతున్నకొద్దీ పరిపాలనా కలాపం వారికి సన్నిహితం కాగలదు. అలా సన్నిహితమైనప్పుడు పరిపాలన ప్రజలకోసం ప్రజల అభీష్టంప్రకారం ప్రజల సహకారంతో కొనసాగడం కళ్లారా చూడవచ్చును. ఆ రోజు ఇంకా రాలేదు. త్వరలో రాగలదని ఆశించవచ్చును. అది వచ్చినప్పుడు స్వాతంత్ర్యమంటే చేదైనది మాత్రమే కాదనీ, దానివల్ల ప్రజలకు చేకూరినది అభ్యుదయమేననీ బోధపడగలదు. స్వాతంత్ర్యం వాస్తవంగా ప్రజలకు అనుభవం కావాలంటే, అది పరిపాలనా యంత్రాంగం వారి కతిసన్నిహితం కావడంవల్లమాత్రమే సాధ్యమౌతుంది. కొంతవరకూ ఇప్పటికి సన్నిహితం కాకపోలేదు. ముందు మరింత సన్నిహితమైనప్పుడు స్వాతంత్ర్యాన్ని ప్రత్యక్షంగా గమనించవచ్చు.





# రామచిలుకలు

"గూటి చిలకేదిరా? చిన్నన్నా!
గూడు చినబోయెరా.
పంచవన్నెల రామచిలుకా
పంచలా పాలాయెగా."

త"త్వాలు" అనబడేటటువంటి ఒక రకమైన పాతసంప్రదాయపు జ్ఞానతత్వార్థబోధగల కీర్తనలు కొన్ని మన తెనుగు దేశంలో చిరకాలంగా పరిపాటిగా ఉండేవి. బ్రహ్మంగారి తత్వాలు చాలా ప్రసిద్ధిగా ఉండేవి. కష్టసుఖాలు చాలా అనుభవించి, జీవితపరమార్థాన్ని జీర్ణం చేసికొన్న పెద్దవాళ్లకు యీ తత్వాలు చాలా మనోహరంగా ఉండి మనశ్శాంతి నిస్తూ ఉండేవి. కాని కాలం మారిపోయింది. తత్వవిచారణచేయడం సోమరిపోతులక్షణం అనిన్నీ, అన్నీ ఉడిగిన ముక్కాలిముదుసళ్ళకూ అసమర్థులకూ అప్రయోజకులకూ మాత్రమే అటువంటి ఆత్మతత్వవిచారణ అర్హమైన మనోవ్యాపకంగా ఉండగలదనిన్నీ, నవనాగరిక నవయౌవనుల మతం. మనస్సుకు విశ్రాంతి కావాలంటే సినెమా ప్రదర్శనానికి వెళ్లి రావచ్చునంటారు. లేకపోతే క్లబ్బుకు వెళ్ళి కాసేపు చీట్లపేక ఆడుకొని, కాఫీ త్రాగి రావచ్చునంటారు. ఇదంతా మనస్సుకు హుషారు కలిగించే వ్యాసంగమే గాని మనస్సుకు శాంతిని నిశ్చలత్వాన్ని కలుగజేసేవి కావు. హుషారు కలుగజేసేవన్నీ నిషావస్తువుల వంటివి. తాత్కాలికమైన ఉత్సాహాన్ని, ఉల్లాసాన్ని, ఉద్రేకాన్ని కలుగజేస్తాయి. దానిమీద మోజు కొద్దికాలం ఉంటుంది. మరొక కొత్తఫిల్ము చూడాలి; మరొక కొత్త మోజు కావాలి. లేకపోతే మనస్సు ఆపోవదు. అది మనస్సుయొక్క "ఆపోవని ఉనికి"—"కోపము-నుబ్బును-గర్వము-నాపోవని యునికియును, దురభిమానము-నిర్వ్యాపారత్వము-నను నివి కాపురుషగుణంబులండ్రు-కౌరవనాథా!" అని భారతంలో స్పష్టంగా చెప్పబడి ఉంది. "ఆపోవని ఉనికి" అనే లక్షణము "కాపురుషగుణం" అనగా దుర్జనలక్షణం అన్నారు. ఏమైనప్పటికి ఏదో ఒక వ్యాపకంతో తాపత్రయపడుతూ విసువు, విరామం లేకుండా ఊపిరి సలుపకుండా తిరుగుతూ ఉండడమే పురుషలక్షణంగా భావిస్తున్నాము "ఉద్యోగం పురుషలక్షణం" అన్నారు గనుక, ఏదో ఒక పనిమీద తిరుగుతూ ఉండాలి. గుర్రాన్ని రవ్వంతఅయినా కట్టివేయకూడదు. గుర్రపు పందెముల కొరకయినాసరే పరుగెత్తుతూ ఉండాలి. క్రాసువర్డు పజిల్సుకోసం కలకాలం తన కలం కాలం వినియోగిస్తాడుగాని కదురు చేతబట్టి నూలువడికే నడివయస్సువాడు ఇమ్మహిలో నహి—ఆపోవనిఉనికి అనేది పరుషలక్షణమైనా, పురుషలక్షణం అంటున్నారు. ఎందుచేతనంటే ఇది నిర్వ్యాపారత్వం కాదు గనుక.

అలాగయితే, తత్వాలు పాడుకొనడం, తన్మూలంగా ఆత్మప్రబోధం కలుగజేసికొనడం మాత్రం నిర్వ్యాపారత్వం ఎట్లా అవుతుంది? "గూటి చిలకేదిరా? చిన్నన్నా! గూడు చినబోయెరా!" అంటే ఏమిటి? దేహం అనే గూడులోనుంచి "జీవుడు" అనే చిలుక ఎగిరిపోతే, ఆ పక్షిగూడుయొక్క జీవకళ పోతుంది. ఆ గూడు చిన్నబోయినట్లుగా ఉంటుంది. ఈ శరీరానికి యీ గౌరవం, యీ గొప్పతనం అంతా, లోపల జీవుడు ఉన్నంత కాలం మాత్రమే-ఈ శరీరంలో ఉండే జీవుడు ఎటువంటివాడయ్యా అంటే, పంచభూతాత్మకమైన శరీరముయొక్క పంచవర్ణములతో పైకి ప్రకాశించే టటువంటివాడు. చివరకు ఎక్కడికి ఎగిరివెళ్లిపోయినదయ్యా అంటే, అది పంచల పాలైంది. ఆ జీవుడు ఏ ప్రాంతాలకో ఏ లోకానికో ఎగిరిపోయి ఉంటుంది. లేదా పంచభూతాలలోనే తిరిగి లీనమైపోయిందేమో! అయితే యీ జీవుడు కేవలం పంచభూతాల సమ్మేళనవల్లనే ఉద్భవించి తిరిగి ఆ పంచభూతాలలోనే లీనమై పోతున్నదేమో!

ఇక్కడ చెప్పబడిన చిలుక పంచవర్ణపు రామచిలుక అని గ్రహించాలి. మనకు తరచుగా కన్పించే చిలుకలు ఆకుపచ్చని రంగుతో ఉంటాయి. అయిదురంగులు గల చిలకలు కూడా ఉన్నాయి. అవి చాలా అందంగా కూడా ఉంటాయి. చిలుకలు అన్నింటిలో ఇది శ్రేష్ఠమైన జాతి అని అంటారు. దీనినే "రాజకీరము."అని చెప్పవలసి ఉంటుంది. హంసలలో శ్రేష్ఠమైన దానిని "రాజహంస" అని వ్యవహరించినట్లుగానే చిలుకల్లో శ్రేష్ఠమైనదానిని "రాజచిలుక" అనే తెనుగు సంస్కృత

[illegible]

సంకర మిశ్రమ శబ్దమును ప్రయోగిస్తే ప్రయోగించి ఉండవచ్చు. "రాజహంస"ను తెనుగులో "రాయంచ" అన్నట్లుగానే, "రాజ-చిలుక" అనేదానికి "రా-చిలుక" అనే శబ్దం ప్రయోగంలోకి వచ్చిఉండవచ్చు. కాని, దానినే "రాంచిలుక" అనిన్నీ చివరకు "రామచిలుక"అనిన్నీ ఉచ్చారణచేయడంవల్ల "రాజ-చిలుక"లేదా "రా-చిలుక"అనే శబ్దము "రామ-చిలుక"గా మారిందేమో. కాని, యీ రా-చిలుకను మనుష్యుల మాదిరిగానే మాట్లాడడం సులభంగా నేర్పవచ్చు. ఇటువంటి చిలుక చక్కగా ఎవరియింట్లోనైనా "రామ! రామ!" అనే శబ్దం పలుకుతూఉండిన సందర్భంలో దానికి "రామ-చిలుక" అనే పేరు అప్పటినుంచీ ప్రచారంలోకి వచ్చి, పరిపాటియై, పర్మనెంటుగా రూఢినామం అయిందేమో! కాని యిదంతా ఋజువు చేసేటందుకు తగినంత పుక్కిటిపురాణగాథా ప్రమాణము రూఢిగా నిర్ధారణగా కన్పించడంలేదు. ఏమైనప్పటికీ సంస్కృతంలో కీరము అనే శబ్దానికి "రాజ" అనే విశేషణపదం చేర్చబడి "రాజకీరం" అనే శబ్దం ప్రయోగంలో ఉంది. "రామ"శబ్దం చేర్చినటువంటి "రామకీరం" అనే మాట వాడుకలో కన్పించదు.

ఇంకో విషయంకూడా గమనించాలి. చిలుకలను రాజమందిరాలలోనే ఎక్కువగా పూర్వం పెంచేవారు. అంతఃపురాలలో రాణివాసంలో పెంపుడు-చిలుకలు ఉండేవి. వాటినే "లీలా శుకములు" "కేళీ శుకములు" అంటారు. వాటిని వినోదార్థంగా అంతఃపురస్త్రీలు పెంచుకుంటూ ఉండేవారు. ఈ కాలంలో దొరసానులు కుక్కలను పెంచి వెంటబెట్టుకొని తిరిగిన విధంగానే, రాణివాసస్త్రీలు పెంపుడు చిలుకలను పంజరాలలో ఉంచి పెంచి వాటికి దానిమ్మగింజలు, కలకండముక్కలు మేతపెడ్తూ చతురోక్తిగా మాట్లాడడం, సరససల్లాపాలు చేయడం వాటికి నేర్పేవారట-ఈచిలకల మెలకువమూలంగా అవి గర్భాధానపు గదిలోని దంపతులు చెప్పుకొన్న మాటలు కూడా రాత్రివిని, ఆ వగలమాటలు పగలు వెల్లడించేవి - అందుమూలంగా ఆ రామలకు ఆ రామ-చిలుకలకు పగలు పెరుగుతూ ఉండేవి. రాజులుకూడా ఇతరత్రా కొంతవరకు మన్మథ తాపోపశమనార్థము మన్మథునకు తర్పణములు విడిచి, చాలా ప్రొద్దు పోయినపిమ్మట, రాత్రి మూడోఆట ముగిసి సినిమాసరసులు (*Film Fans*) తిరిగి కొంపలకు చేరేవేళకు రాజులు రాకుమారులు అంతఃపురానికి వచ్చేవారు. అయ్యావసరంబున అమ్మగారు అలకపాన్పుపై చేరేది. రాణీగారి అలుక తీర్చడానికి రాజుగారికి చిలుకద్వారా అన్యాపదేశ సరససల్లాప ప్రసంగాలు జరుగుతూ ఉండేవి. "పలుక మన్న పలుకవే! పంచదార-చిలుకవే!" అని కొన్ని ఏలపదాలు, తిల్లానపాటలు, కమాచ్‌లోనో, కాఫీలోనో జావళీలుపాడితే ఆయా ఠుమ్రీ, టప్పా, తోహరా, గజల్ వగైరా గవాయి దరువులతో రాణికి ఖయాల్ తిరిగి, ఖుషీ కల్గి, ఉల్లము పల్లవించి రాజుగారిపై చల్లని అపాంగ వీక్షణములను అప్పుడు రాణీగారు ప్రసరింపజేయవచ్చు. అంతటితో ఆమె ప్రణయకోపప్రళయము శాంతించవచ్చు - ఈ ప్రణయకోపాలు, యీ కోపాటోపశమన శయన సల్లాపాలు అంతఃపురగోష్ఠిలో ఎప్పటికప్పుడు నిత్యవినోదకాలక్షేపంగా గరంగరం తాజామాల్‌గా ఉండేవి - అందుకనే "రాధికాసాంత్వనం" "సత్యభామాసాంత్వనం" వంటి కావ్యములు, పారిజాతాపహరణంవంటి ప్రబంధాలు వ్రాసిన కవులకు ఆస్థానం కవులు కిచ్చి వేసినట్లుగా రాజులు ఆకాలంలో కవులను సన్మానించారు. చిలుక చెప్పినకథలు అనేపేరుతో కవి కీరములే రచించాయి. రంకు నేర్చిన బొంకనేర్చి యుండవలెననే లోకసిద్ధాంతమును ఋజువు చేయడానికి శుకసప్తతి కథలు వ్రాశారు. ఇవన్నీ పచ్చిశృంగార కథలని కొందరు అన్నారు - ఎండినవాటి కన్నా పచ్చివాటిలోనే వైటామినులు (జీవధాతువులు) ఉంటాయి. ఏమైనా యీ కథలు పక్షి చెప్పిన కథలు గనుక పక్షికథలే గాని పచ్చికథలుకావు. ఇదేవిధంగా యింకొ పురాతన పురాణకాలంలో హంసలు కూడా యిటువంటి రాణివాస మర్మకర్మధర్మములను గ్రహించి రాజులకు రాణులకు మధ్య రాయబారాలుకూడా నడిపించినవని పురాణాలు ఘోషిస్తున్నాయి. వ్యాసమహర్షివంటి పరమహంస వ్రాసిన పురాణంలోనే భారతంలోనే, నలమహారాజుకు దమయంతికి మధ్య రాయబారాలు నడిపించి, ఉభయులకూ వలపు పుట్టించి, వారికి మనఃప్రభవానల జ్వాలలు రెట్టించి, నలునిచేత దమయంతికి పుస్తె కట్టించుటకు కారణం ఎవరంటే దమయంతి కాసారంలో తిరుగుచుండిన ఒక రాజహంస - ప్రబంధయుగంలో రామ-చిలుకలు ఎట్లాగో, పురాణయుగంలో రాయంచలు కూడా అదే విధంగా రాయబారాలు నడుపుతూ అంతఃపుర కాంతలకు అంతరంగ కార్యదర్శులుగా ఉండేవి. శుకసప్తతి కథలు ఎట్లాగో హంసవింశతి కథలు కూడా

"ఎప్పటి కయ్యది ప్రస్తుత
మప్పటి కామాటలాడి యన్యులమనముల్
నొప్పింపక తానొవ్వక
తప్పించుక తిరుగువాడె - ధన్యుడు సుమతీ!"

అని బోధించాయి.

పూర్వకాలములో రాణివాసపు స్త్రీలు తమ పెంపుడు చిలుకలను వెంటబెట్టుకొని తిరుగుతూ ఉండడం ఒక ఫ్యాషనుగా, రాణీవాస రీతిగా ఉండేది. చిలుకను చేతిమీద నెక్కించుకొని గాని, బుజంమీద ఎక్కించుకొని గాని తిరిగేవారు. ఆండాళ్ గోదాదేవి (చూడిక్కుడుత్తనాంచారమ్మ) విగ్రహమందుగాని, ఆమె పటంలోగాని రామ-చిలుక యొకటి బుజంమీదనో చేతిమీదనో ఉంటుంది. రాణుల బొమ్మలను చిత్రించినప్పుడు ఆవిధంగా చిత్రించడం ఒక సంప్రదాయంగా ఉండేది - "రామ" అంటే "స్త్రీ" అనే అర్థంఉండిగనుక, "రామ-చిలుక" అంటే స్త్రీలచే పెంచబడు చిలుక అనికూడా అన్వయించవచ్చునేమో. లేదా, ఆరామం అంటే తోటగనుక "ఆరామచిలుక" అంటే తోటలలో విహరించే చిలుక అనే పదప్రయోగం కూడా ఉన్నదేమో. "ఆరామచిలుక" అనేశబ్దం కొంతకాలానికి "రామచిలుక"అనే రూపంలోకి మారియుండవచ్చు-లేదా రమ్యమైన చిక గనుక దానిని రామచిలుక అని వ్యవహరించి యుండవచ్చు ఇంగ్లాండులో ఒకప్పుడు గొప్ప గొప్ప సామంత ప్రభువులు డేగలను పెంచేవారు. వారి బుజాలమీద వాటిని ఎక్కించుకొని తిరగడం ఆ కాలపు రాజరీవిగా ఉండేది. సారంగధరుడు పావురాలను పెంచి షోకుగా వాటిని వెంటబెట్టుకొని ఎగుర వేశేవాడు. ఆనాటి రాజుల కులములో పావురములను పెంచడం ఫ్యాషనే అయియుండవచ్చు.

అర్జునుడు దొంగ బైరాగి వేషం వేసికొని బలరాముని చెల్లెలైన సుభద్రచేత శుశ్రూష చేయించుకుంటూ ఉన్న సందర్భంలో, పెండ్లికి సిద్ధంగా ఎదిగిఉన్న ఆ పహిలా పచ్చీసు పడుచుపిల్లతో అర్జునుడు సరసాలు ఆడి "సరే" అనిపించాడు. కాని యీ సరసాలన్నీకూడా ఆ సుభద్రవద్ద వెంటఉన్న పెంపుడు చిలుకతో సంభాషించినట్లుగా చేశాడు. అసలు అర్జునునివద్దకు సుభద్ర వచ్చేటప్పుడు ఏ విధంగా వచ్చిందో చూడండి—

"కంగుల్ దీర్చిన పైరిణీ అనిక
చన్నట్టంటి రాణింపగా
జెంగల్వల్ నెతికొప్పునందు నొఱపై
చెంతన్ సుబాళింపగా

బంగారందియ ముక్కునం గమచి
పైపైనంచ యెల్గింపగా
సింగారం బగు ముద్దుజిల్క తనకుం
జేవోడు వాదోడుగాన్."

తా॥ ముడుతలులేని జరీబుటా పైరిణి రవిక తొడుక్కుంది. చెంగల్వపూలు కొప్పులో పెట్టుకుంది. పెంపుడు హంస తన పాదాలవెంటనే నడుస్తూ ఆమె హంస నడకను ఎక్కిరిస్తోంది. చేతిమీద ముద్దు చిల్కను ఎక్కించుకొని వాదోడుగా (మాట లందివ్వడానికి) తెచ్చుకుంది.

ఇదంతా చూచి సుభద్రతో అర్జునుడు యిలా అన్నాడు. చాలామందికి లోకంలో శృంగారకథలు చెప్పి ఎందరో దంపతులను జతకూర్చిన శృంగారపక్షికులానికి చెందిన ఓ కీరమా!

రతికిన్ భారతికిన్ వినోదకథ
లం బ్రాగల్భ్యముం జూపి, త
త్పతులం గూరిచి, మాటవాసిగను
పెద్దల్ గారె మీవార? లా
చతురత్వం బిట గొంత కానబడ
నీ చంద్రాననన్ గూర్చి, నన్
బ్రతికింపంగదె, ముద్దు గీరమ
సుధాబంధూభవద్గీరమా?

తా. సుధా = అమృతమునకు బంధూ భవత్ = చుట్టము అగుచున్న (అనగా అమృతమువంటి) గీః = వాక్కుయొక్క, రమా = సంపదగల్గినదానా ? ముద్దుకీరమా! ఈచంద్రముఖికి నాకు జత గూర్చి బ్రతికించు - ఆ మాటవిని సుభద్రఅందుకొని—

"మేరలా యివి మీయంత వారలకును?
బెద్దలున్నారు, వారెగ్గి పెండ్లిసేయ
గలరు - వేగిరపాటింత వలదటంచు
విన్నపము సేయరాదె ఓచిన్నిచిలుక?"
అన్నది.

అప్పుడిక అర్జునుడు చిలుకకు వకాల్తనామా యివ్వకుండా, కేరాఫ్ రాజకీరం అనకుండా, సరాసరి సుభద్రనే సంబోధించాడు.

"మీవా రెఱుగుట యెన్నడు?
కావించుట యెన్నడింక గళ్యాణంబున్
నీవేల జంపు నడపెదు?
రావే మాటాడ కిందు రాకేందుముఖీ!"

అన్నాడు. నీవేల జంపు నడపెదు? అంటే 'నీవెందుకు (జాప్యం) ఆలస్యం చేస్తావు.' అని అర్థం.

ఈ విధంగా చిలుకలు రాజమందిరాలలో అనుసంధానోద్యోగులుగా (*Laison officers*) లాగున వ్యవహరిస్తూఉండేవి.

అసలు రాజులకు రాణులకు మధ్య అనుసంధానంగాని పరస్పర రాగానుసంధానంగాని చేసేవాడు మన్మథుడు కానేకాదు. మన్మథునియొక్క వాహనమైన చిలుక ద్వారానే చాలావరకు యీ పనిఅంతా జరిగిపోతూ ఉండేది. చిలుకవల్ల కూడా సాధ్యం కాకపోతే అప్పుడు హైకమాండు జోక్యం కల్పించుకున్నట్లుగా మన్మథుడు తన పరివారంతో అనగా వసంతుడు, చంద్రుడు, మలయమారుతం, కోకిల, వగైరా ఫౌజుతో వచ్చి, ఏ అభ్యర్థులను ఏ స్థానానికి తమపార్టీతరపున నిలువబెట్టవలెనో నిర్ణయించి, రాజకీరములకు సాధ్యంగాని స్వకీయ పరకీయ రాజకీయ తంత్రములను నడిపిస్తాడు.

చింతామణి అనే వేశ్యవలలో చిక్కిన బిల్వమంగళుడు, ఆ చింతామణివల్లనే ఆత్మజ్ఞానప్రబోధం పొంది లీలాశుకు డను పేరుతో గొప్పభక్తుడై యోగియై "కృష్ణ కర్ణామృతం" అనేటటువంటి గ్రంథం రచించాడు. అందులో ఉన్న శ్లోకాలు భక్తిరసపరవశుడైన ఆ లీలాశుకయోగి యొక్క ఆత్మానందసుధాజలధి తరంగాలు. అతడు "చింతామణి ర్జాయతు" అనే శ్లోకంతో "చింతామణికీ జై" అని గ్రంథం ప్రారంభించాడు. భోగియై కామియై చింతామణియొక్క పెంపుడు చిలుకవలెనే (లీలాశుకంలాగున నే) సంచరించాడు. యోగియై, విరాగియైనతర్వాత కూడా "లీలాశుకయోగి" అనే పేరు పెట్టుకొన్నాడు.

పూర్వకాలంలో ఊర్వశి అనబడే అప్సరస అనగా యింద్రుని స్టూడియోలో ఉండే ఒక సినెమాతార పురూరవుడు అనే రాజును వలపించి ఆయనకు టోకరా వేసి పారిపోయివచ్చింది. అది పారిపోయే సమయంలో చిలుకరూపం పొంది పారిపోయింది. త్రోవలో వ్యాసులవారు దానిని చూచారు. ఆయనకు కూడా దాన్ని చూచే సరికి మనస్సు చలించింది.

"మనసు గుఱ్ఱంబు, కళ్లెంబు
మఱియు మఱియు
నెంత లాగిన నిలువక
గంతులిడిన,
నగ్నికై మంథనము సేయు
నరణియందు
నా తపసిరాయని
శుక్ర పాతమయ్యె."

"శ్రీమద్రమారమణ గోవిందోహరిః"యజ్ఞహోమాగ్ని పుట్టించడంకోసం అరణి అనే కర్రలతో కవ్వంలాగున మధిస్తూఉండే అక్కడ పడిన వ్యాసబీజంలోనుంచి

"వ్యాసుబోలినవాడు, పావనుడు, దివ్యమూర్తిగలవాడు, చక్కని మోమువాడు, భవ్య తేజంబువాడు, పాపరహితుండు, ముద్దుబాలు డొకండు సముద్భవించె."

వ్యాసమహర్షికి ఆ రీతిగా కలిగిన అప్రయత్న పుత్రుడే పరమపవిత్రుడైన శుకయోగి—

"అరణి మథియింప బుట్టిన యమ్మునీంద్ర
బాలునకును శుకీరూపమోలిదాల్చి
యున్న యూర్వశి యమ్మౌని యునికి
గాన
బడిన కతమున శుకనామమిడిరి ద్విజులు"

చిలుకరూపంలో ఉన్న ఊర్వశియొక్క సమ్మోహనాస్త్రం మూలంగా అరణితో అగ్నిని పుట్టించేచోట పుట్టిన పిల్లవాడు కావడంచేత ఆ పిల్లవానికి "శుకు"డు అని నామకరణం చేశారు. ఆ శుకయోగి ఎటువంటి వాడయ్యాఅంటే—

"నాకు వలదు పెండ్లి నాయనా పెం
డ్లాము
మెడకు గట్టునట్టి పెద్దబండ
కట్టికొట్టనేల కాలి సంకెలి నాకు
ననుచు బలుక దండ్రి యనియె నిట్లు"

"చనుము విదేహునొద్దకు" అని చెప్పి జనకమహారాజువద్దకు పంపించాడు జనకుడు చెప్పినా, జనకమహారాజు చెప్పినా ఆ శుకుడు పెండ్లిపందెర తాటియాకుల వాసనగాని, ముత్తయిదువుల పసుపుగంధం వాసనగాని తనకు గిట్టదన్నాడు.

"పెండ్లివలదయ్య పెండ్లాము పెద్దజెలగ;
యొడలి నెత్తురు మెత్తగా నొత్తి పీల్చు
మగువ వగలను దగిలి కామమున జిక్కి
యెడ్డెలగుమానవులెఱుంగ లెరుక తెరవు"
అన్నాడు.

అటువంటి శుకయోగి దేహాభిమానం కూడా విడిచి దిగంబరుడై పోతూఉండేవాడు. స్త్రీలు వివస్త్రలై స్నానాలు చేస్తూ ఉండగా ఆయన యీ ఆడవాళ్ళప్రక్కనుంచే నిర్భయంగా వెళ్ళేవాడు - వాళ్లు కూడా నిర్భయంగా స్నానాలుచేస్తూ ఆయనను ఏమీ అనేవారు కారు, కాని యీ శుకయోగి తండ్రియైన వ్యాసులవారు రాగానే ఆ స్త్రీలు సిగ్గుపడి చీరకొంగులు వక్షస్థలంమీద వంటనే కప్పుకొనేవారు - ఆ శుకుడు దిగంబరుడై సర్వసముడై పెళ్లి చేసికోకుండా ప్రకృతియొక్క బిడ్డగా సంచరించాడు.

"సముడై ఎవ్వడు ముక్తకర్మచయుడై
సన్న్యాసియై యొంటి బో
వ మహాభీతి నొహో కుమారయనుచున్
వ్యాసుండు చీరంగ, వృ
క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు
చక్కంజేసె ము; న్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణి
దపోధన్యాగ్రణిన్ ధీమణిన్."

అని బమ్మెర పోతన్న వంటి మహాభక్తుడు ఆ శుకయోగికి నమస్కారం చేశాడు: వ్యాసుడు "ఓహో! కుమార!" అని ఆ అరణ్యంలో శుకులవారిని సంబోధించి కేక వేస్తే, ఆ అరణ్య వృక్షాలన్నీ ప్రతిధ్వనిస్తూ "ఓహో! కుమార!" అన్నాయి. ఆ మహా యోగి ప్రకృతితో లీనమైపోయినాడు అని అర్థం - బమ్మెర పోతరాజు గారు తాను రచించే ఆంధ్రభాగవతం ఎటువంటిదో ఒక్క పద్యంలో వర్ణించారు.

"లలితస్కంధము కృష్ణమూలము
శుకాలాపాభిరామంబు; మం
జులతాశోభితమున్ సువర్ణసు
మనస్సు జ్ఞేయమున్; సుందరో
జ్జ్వల వృత్తంబు; మహాఫలంబు-విమల
వ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు
వుర్విన్ సద్ద్విజశ్రేయమై."

పద్యం మొదటినుంచీ చివరవరకు రెండర్థాలు కలిగి మనోహరమైన శ్లేషాలంకారంతో వ్రాశారు. లలిత అంటే మృదువైనది. లలిత అంటే ఆదిశక్తియైన లలిత అనేదేవత. భాగవతానికి మొదలు లలితమైనది. లలితాపరమైనది. భాగవతం అనే మహావృక్షం శుకాలాపాభిరామంబు అనగా చిలుకల కంఠస్వరాలతో శోభిల్లునట్టిది. శుకమహర్షి చెప్పిన పురాణవిశేషము-అని యీ విధంగా భాగవత పురాణగాథలన్నీ కూడా శుకాలాపములే అన్నారు. పోతన్నగారివి కూడా నిజంగా చిలుకపలుకులే. ఎందుచేతనంటారా?

"పలికించెడివాడు రామభద్రుండట; నే పల్కిన భవహరమట" అని వ్రాసుకున్నారు.

"నాకేమీ తెలియదు. రామభద్రుడు ఎట్లా పలికిస్తాడో ఆవిధంగా నేను చిలుక పలుకులు పలికినట్లుగా భాగవతం రచిస్తాను" అని పోతన్నగారు అన్నారు.

ఆయనయొక్క స్వామి, ఆయన ఇష్టదైవం శ్రీరామచంద్రుడు. ఈ కవిత్వధార అంతా శ్రీరామచంద్రునిదే అంటారు. మనలో కూడా కొందరికి పార్టీనాయకుడు ఎంత చెప్పితే అంతే. శ్రీమాన్ రాజగోపాలాచార్యులు గారిని గురువుగా భావించినవాళ్లు తమ బహిరంగ ఉపన్యాసాలలో ఏదిచెప్పినా,

ఆచార్యులవారి వాక్యాలే తిరిగి పలుకుతూ ఉంటారు. వారి వాక్కు స్వామి వాక్కు. అనగా "హిస్ మాస్టర్సు వాయిస్ (*His Master's Voice*) అని వ్యవహరిస్తూ ఉంటారు. గ్రామాఫోను గొట్టం ఎదుట కూర్చున్న కుక్క ఆ గొట్టంలో తన స్వామియైన యజమాని కంఠస్వరం ఆలకిస్తూ ఉండడం, ఆ గ్రామాఫోను యంత్ర తంత్ర విచిత్ర విశేషం. శునకము కూడా ఆ గ్రామాఫోను సంగీతం పెట్టెలోనుంచి వచ్చే తన యజమానికంఠస్వరం విని ఆనందించ గలుగుతుంది. "శిశుర్వేత్తి పశుర్వేత్తి, వేత్తి గానరసం ఫణిః" అని మనపూర్వులు అన్నారు. సంగీతరసమును శిశువులు పశువులు సర్పములు కూడా విని ఆనందిస్తాయి అన్నారు. గ్రామాఫోనులు వచ్చినతర్వాత "శ్వానం వేత్తి గానరసం" అని కూడా మరొక ఉదాహరణ చేర్చారు.

శుకములు (చిలుకలు) ఒకప్పుడు గొప్పవాళ్ల యిళ్లల్లో పెంచబడుతూ ఉండేవి. అవిధంగానే శుకములకు బదులుగా శునకములు నేడు గొప్పవాళ్ళయిళ్ళల్లో పెరుగుతున్నాయి. చాలా విశ్వాసంగా యజమానిని ఆశ్రయించుకొని ఉంటాయి శునకములు. అయితే, వీటికి పూర్వ పురాణ యుగంలో గౌరవం లేదని చెప్పడానికి వీలులేదు. శుకమహర్షి అని పేరు పెట్టినట్లుగా శునక శబ్దాన్ని కూడా గౌరవించి శౌనకమహర్షి అనే పేరుతో వెలసిన మహానుభావుడు కూడా ఉన్నాడు. శుకుడు శౌనకుడు వీరందరూ పురాణములను ఉద్ధరించిన పురాణపురుషులు—

కంచర్ల గోపన్నగారు రామచిలుకను ఒకప్పుడు పంజరంలో బంధించి పెంచినారనిన్నీ అందుచేతనే ఆపాప కర్మానుభవంగా రామదాసుగారు బందిఖానాలో శిక్ష అనుభవించారనిన్నీ అంటారు. ఆ భయంచేత చాలామంది మనలో శుకమును పెంచడం తగ్గి శునకములను పెంచడం ఎక్కువైనదేమో. అయినా గాంధిమహాత్ముడు ఎప్పుడూ 'రఘుపతి రాఘవరాజారాం" అని రామనామస్మరణ చేస్తూనే ఉండేవాడు. కాని ఎప్పుడూ రామచిలుకలను పంజరంలో పెట్టి ఆయన బంధించలేదు. అయినప్పటికీ ఆయన జీవితంలో విశేషభాగం కృష్ణ జన్మస్థానంలోనే గడచింది. ఆయన చేసిన ఉపదేశాలు అన్నీ ప్రస్తుతం మనకు వట్టి చిలుకపలుకులైనాయి. ఆ ఉపదేశాలన్నింటిని అనుష్ఠించడం మాత్రము మనవల్ల అయ్యేపని కాదని ఎంచి, ఆయన ఉపదేశాలకు "రాం! రాం!" అనే రామచిలుకలు ఈదేశంలో చాలా ఉన్నాయి.

రాజకీరముల ప్రజ్ఞావిశేషం ప్రాచీన ప్రబంధ కవిత్వంలోనేగాని, ప్రస్తుత వ్యవహార ప్రపంచానికి వర్తించదని వాదించడం వట్టి అజ్ఞానం.

ప్రజలకుపత్రికలలోని ప్రకటనలు ప్రమాణాలు గనుక, గతమాసంలోని పత్రికలలో ప్రకటించిన ఒక వార్త చదివి చూడవచ్చు. బ్రిటిష్ ఓవరుసీస్ ఎయిర్వేసు కంపెనీ యొక్క చెయిర్మను అయినటువంటి సర్ మైల్సు థామసుగారు ఆఫ్రికానుంచి ఒక రాజకీరమును తీసికొనిరమ్మని తమ విమానాల సర్వీసుమీద పనిచేసే ఒక వైమానికునితో చెప్పారు. ఆ వైమానికుడు ఆఫ్రికానుంచి లండన్‌కు ఆ చిలుకను తీసికొనివస్తూ దానిని తనప్రక్క సీటులోనే ఉంచుకుని, దానికి ఒక చక్కని వాక్యం నేర్పాడు. "వైమానికులకు హెచ్చు జీతా లివ్వాలి" అనే మాటలు పల్కడం నేర్పాడు. ఆ విమానసర్వీసుకంపెనీ చెయిర్మనువద్దకు ఆ చిలుక రాగానే "వైమానికులకు హెచ్చు జీతా లివ్వాలి" అనే పల్లవి ఆలాపన చేయడం సాగించింది. "పారట్" అనే యింగ్లీషు మాటకు "చిలుక" అని అర్థం — "పారట్ క్రై" అంటే చిలుక పలుకులు అని అర్థం.

ఈ రాజకీయ వ్యవహారాల్లో ఉన్న తత్వం ఏమిటంటే "నీవు చెప్పిన విద్యయే నీరజాక్ష" అన్నట్లుగా ఏ పాఠం వల్లించమంటే ఆ పాఠం మాత్రమే వల్లించేటటువంటి ప్రజ్ఞ ఉండాలి. అది "పారట్" ప్రజ్ఞ. ఈ "పారట్" లక్షణం మనుష్యులు కూడా అవలంబిస్తే, దానినే "పారటి" లక్షణం అని పిలువవలసివస్తుంది. "కాంగ్రెసు పారటి" (అనగా కాంగ్రెస్ పక్షం) అనేది ఒకటి ఉంది. అది అందరికీ తెలిసిన విషయమే. ఈ కాంగ్రెసు పక్షంలో చేరిన కాంగ్రెసుపక్షులందరూ ఒక్క మాటమీద ఉండాలి. అప్పుడు కాంగ్రెసు పారటీ అనేది ఒక "పారటీ" గా గౌరవింపబడుతుంది అని అన్నారు. మద్రాసును వదలుకొని ఆంధ్రజిల్లాలతో ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చెయ్యాలి. అని (జే) జవహరలాలు నెహ్రూ, (వి) వల్లభాయి పటేలు, (పి) పట్టాభి సీతారామయ్యగార్లు ఒక కమిటీగా తమ నివేదికలో వ్రాశారు. దీనినే జే. వి. పి. రిపోర్టు అన్నారు. జే వి. పి. రిపోర్టుకూ జేజేలు అన్నారు ఇటీవల ఆంధ్రకాంగ్రెసు సంఘాధ్యక్షులైన సంజీవరెడ్డిగారు—కాంగ్రెసు పారటీలోనివారు అందరూ—అదే మాట ఆలాపన చెయ్యాలన్నారు, "తానతందాన" అనే బుర్రకథ గాయకబృందం లాగున శాసనసభలోని "కాంగ్రెసు పారటీ" తయారైతే, అది బుర్రకథా కాలక్షేపం కాదనిన్నీ బుర్రలేని కథాకాలక్షేపం అనిన్నీ ప్రజాస్వాతంత్ర్య, వాక్స్వాతంత్ర్య, అభిప్రాయస్వాతంత్ర్యవాదులు అంటారు. కాని, కాంగ్రెసు పారటీ అనే దానికి క్రమశిక్షణతో కూడిన "పారటీ" తత్వం ఉండితీరాలి. రాజకీయాలలో ఉండే రాజకీరాలు చిలుకపలుకులు పలుకవలెనంటే, వానిని పంజరంలో పెట్టి బంధించడం కూడా పారటీ క్రమశిక్షణం అవుతుంది.

"పంజరంబుననున్న కట్లను-పగులదన్నగలేక స్రుక్కుతి" అని బంధింపబడిన పక్షులు విలపిస్తాయి "మద్రాసును వదులుకోవలెనా అక్కరలేదా" అనేవిషయమై వోట్లు తీసికొనడం సంభవిస్తే, కాంగ్రెసుపారటీ అంతా "ఒక మాట ఒక బాణం" అన్నట్లుగా వోట్లు యివ్వాలి అదే పారటీ కట్టుబాట్ల ఫలిత పర్యవసానంగా పరిణమించాలి కాని రెక్కలువచ్చిన పక్షులను నమ్మడానికి వీలులేదు ఎవరి "వోటు రహస్యం" వారికే తెలియాలి కాబట్టి పక్షిశాస్త్రం బాగా తెలిస్తేనేగాని రామచిలుకలనబడే రాజకీరముల నిజతత్వం ఆత్మతత్వం బోధపడదు. వోట్ల సమయం వచ్చేసరికి "కాకః కాకః పికః పికః" అన్నట్లవుతుంది కాకి గూట్లో పెరిగిన కోకిల తనదారిన తానుపోయి ఇంకో కంఠస్వరంతో ఇంకో నినాదం సాగిస్తుంది.

"గూటి చిలకేదిరా? చిన్నన్నా
గూడు చినబోయెరా?

అని కలువరిస్తే లాభంలేదు. కాంగ్రెసు పార్టీబలం ప్రజలలో పూర్తిగా పుష్కలంగా ఉంది అనుకుని ఎన్నికలకు దిగిన తర్వాత, ఎన్నికలలో మన కెన్ని కలలో కల్లలైనాయి - ఆంధ్రరాష్ట్రం అంటే అది ఒక ప్రజాభీష్టం - అది కేవలం కాంగ్రెసు పార్టీ యిష్టం కాదు — కాంగ్రెసు పారటీ "గూడు చినబోయెరా" అని అంది, శాసనసభలో తమ పారటీబలం తగ్గగానే - సొంత చిలుకలు తక్కువైతే పైచిలుకలు కొన్ని చేర్చుకొని ప్రస్తుతం చిన్నతనం లేకుండా పెద్దతనం వచ్చిన రాజాజీ పెద్దతనం వహించవలసి వచ్చింది.

ఇకముందు ఎప్పుడైనా సరే, ప్రజాభీష్టంతో ప్రభుత్వాభీష్టం యీడుజోడు కలిసి చిలుక గోరింకలులాగున ఎగరాలి -

"గూటి చిలకేదిరా

గూడు చినబోయెరా"

అనే విషాదం కలుగకుండా రాజకీర రాజకీయ తత్వం బాగా జీర్ణం చేసుకోవాలి. ★

# నాగమణి చదువు

శ్రీమతి [illegible]

మల్లెపువ్వులు కోసి మాలకట్టి సరస్వతీదేవి పటానికి అలంకరించి, భక్తితో నమస్కరించింది నాగమణి. 'పేపర్ సార్,' అంటూ వీధిలో కేక వినిపించింది. మణి వీధిలోకెళ్ళి పేపరుతెచ్చి మేజామీద పెట్టి కుర్చీదగ్గరగా లాగి, కూర్చుని దినపత్రిక చూసింది.

గడ్డిపాడులో గరల్స్ హైస్కూల్ నిర్మించిడానికి 40 వేల రూపాయిలు విరాళం ఇవ్వబడిందనీ, స్కూలు అర్థభాగం పూర్తయిందనీ, రెండుమాసాలలో పూర్తి కావచ్చనీ, పెద్ద పెద్ద అక్షరాలతో వ్రాసివుంది. ఇది చదవగానే ప్రతిరోజూ ఇంట్లో తన చదువు విషయమై, జరిగే ఘర్షణ గుర్తుకొచ్చింది మణికి. పేపరుతీసి దూరంగా పెట్టేసింది. స్త్రీలు విద్యావంతులు కావాలని గరల్స్‌స్కూల్స్ స్థాపిస్తున్నారు. కాని తన నాయనమ్మలాంటివారుంటే బాలికలు ఎలా వృద్ధిలోకి వస్తారు?

గడియారం చూసింది. స్కూలుకు టైమవుతోంది. డ్రాయరుతీసి టైమ్‌టేబుల్ చూసి, లెక్కలు, జాగ్రఫీ, ఇంగ్లీషు, తెలుగు పుస్తకాలు తీసి మేజామీద పెట్టి, తెలుగునోట్సు చదవాలని తెరిచింది. హోమ్‌వర్క్ లెక్కలు గుర్తుకొచ్చాయి, నోట్సు మూసి లెక్కలపుస్తకం తెరిచి లెక్కలు వేస్తోంది. చెల్లెలు "భారతి" ఏడుస్తోంది. లెక్కలు చేసి ఎత్తుకోవచ్చనుకొంటూ ఊరుకుంది మణి, కలం కాగితంమీద వుందే కాని మనసంతా భారతి ఏడుపుమీదే వుంది. మళ్ళీగోల వస్తుందేమో అన్నట్లు చేసేస్తోంది లెక్కలు.

"అక్కా, లెక్క చేసి పెట్టవ్" అంటూ వచ్చాడు మురళి.

"నా లెక్కలే చెయ్యలేదిప్పటికి, నీలెక్కలేం చేసిపెట్టనురా"

"మా మేష్టారు కొడతారే ఒక్క లెక్కేగదా. ఎంతసేపు చెయ్యాలే, నా ఒక లెక్క చేసి తర్వాత నీయిష్టం వచ్చినంతసేపు చేసుకోరాదూ!"

"నాకిప్పుడు తీరదురా మురళీ" విసుఫుగా అంది మణి.

"చేసిపెట్టవ్ కదూ, సరేలే," కోపంగా చూస్తూ వెళ్ళిపొయ్యాడు మురళి. "అక్కయ్య చూడవే ఒక్క లెక్క చేసి పెట్టమంటే చేసిపెట్టడంలేదే నాయనమ్మా, తీరదుట" కోపంలో చెప్పేశాడు మురళి.

మణిలెక్కలు పూర్తిచేసి బుక్స్‌సర్ది టేబుల్‌మీద పెట్టి టైమవుతోందని, త్వరగా జడవేసుకుని మురళి ఏమి చెప్తాడో అన్న భయంతో కిటికీలోంచి తొంగి చూసింది. ఎత్తేసే ఎత్తింది ఎప్పటి గోల, ఎప్పుడు వీలవుతుందా అని చూసే మంగమ్మకు సమయం దొరికితే వదులుతుందా?

"ఆ, అదెక్కడ చేస్తుందిరా? దాని షోకులు, దాని రీవి అబ్బో, జడవేసుకుని సింగారించుకొని, వయ్యారంగా ఆ పుస్తకాలు చంకనేసుకుని బడికెళ్ళమంటే, నాకంటే మించినవాళ్ళు లేరన్నట్లుగా పోతుంది. చిన్నపిల్ల ఏడుస్తోంటే దాని కేమైనా వినిపిస్తోందా? ఆ పుస్తకాలు ముందు పెట్టుకుని ఎవరిగోల పట్టనట్టు రాశేస్తోంటుంది. ఏమిటో ఆ బ్రహ్మరాత! పనిచెయ్యకపొయ్యినా పిల్లనేనా కాస్త చూడొద్దూ, ఎంత గారాలకూతురైతేమాత్రం? మీ నాన్న చేస్తున్నాడు లేరా, దాని కింకేం చదువు, మాన్పించమంటే, ఇక ఒక్క ఏడు చదివితే స్కూల్ ఫైనల్ పూర్తవుతుంది, ఏం మించిపోతేదులే అంటాడాయె. ఇంటిదగ్గరవుంటే కదా నే చెప్పడానికి. ప్రొద్దున్నే బడి కెళ్ళడం, సాయంత్రం రావడం, అన్నీ రెడీచేసి పెడితే అమ్మగారు భోంచేయడం. ఆ పుస్తకాలు తిరగేస్తూ కూర్చోడం, తీరికెలా వుంటుంది? ఆబడి మానేస్తే అప్పుడు చెబుదును దానిపని. మా కాలంలో దీనంత అయేటప్పటికి, పెండ్లయి, ఇంట్లో పనంతా రాత్రనక, పగలనక చేసేవాళ్ళం. ఆ యేం రాత. అన్నీ మారిపొయ్యాయిలే. కాబట్టే కాలంగూడ ఇలా కరువు కొట్టుకుని ఏడుస్తోంది. ఆ స్కూళ్ళకు జీతాలు కట్టడానికే చాలదు వున్న డబ్బు. రెండురోజులకొకసారి, పుస్తకాలూ, పెన్నులూ, సిరాలూ కొనాలాయె. మీ నాన్న అడిగినవన్నీ లేదనకుండా తెచ్చిపెట్టాడు. మనమంటే దానికి అంత చిరాకు అందుకే. చదివి వెలగబెట్టుందిలే చూదాంగా. పనిచేతకాదు సరికదా, ఇంట్లో మొగబిడ్డ చదువు కూడా పోతోంది. నీకా పాఠాలు చెప్పడానికి తీరికేదీ? దాన్ని చదువు మాన్పిస్తేనే గాని, నీకు చదువురాదురా, నే చెప్తున్నాగా! అయినా, నే నెవరిని చెప్పడానికి, నీకేం తెలియదు నువ్వూరుకో మంటాడు మీ నాన్న. ప్రొద్దస్తమానమూ చదువే దీని దుంపతెగా. చెముడొచ్చిందా ఏమే? మాట్లాడవేం, భారతి నొక్కమాటు ఎత్తుకో. నేను పూజ చేసుకోవాలి. మీ అమ్మకు వంటకాలేదు"

తన అక్కసునంతా వెళ్ళబోసింది మంగమ్మ. క్రూరంగా చూస్తూ మణిచేతికి భారతినిచ్చి, "ఇకనేనా ఆ పుస్తకాలక్కడపెట్టి కాస్త ఎత్తుకో అమ్మా ఏమి అరిగిపోవు. చదివి తర్వాత వెలగబెట్టొచ్చులే".

విసురుగా వెళ్ళిపోయింది మంగమ్మ. ఈ పురాణం వినలేక విసుగుతో వెళ్ళిపొయ్యాడు మురళి. మణికి గజందూరంలో పిడుగుపడి నట్లయింది. మనసులో ఆవేదన ఎక్కువైంది. పత్రికలో చూసిన విషయం మనసులో కదిలింది.

మణిహృదయం కలతచెందింది. పూర్వానికీ, ఇప్పటికీ వత్యాసం ఉండకూడదని నాయనమ్మ పటుదలై వుండాలి. స్త్రీ విద్య నేర్వకూడదా? ఈ స్కూళ్ళన్నీ ఎందుకు? అందరూ ఇలాగే బాధపడ్తారా? తన కెప్పుడూ చదువుమీద వున్న దృష్టి ఇక దేనిమీదా లేనిమాట నిజమే. అందుకేనా తన్నిట్లా బాధపెట్టడం? ఏదో ఒక తప్పు పడుతుంది. తనేం చెయ్యాలి? స్కూల్లో బాగా చదవాలన్న మాట ఇంటికివస్తే మరచిపోవాలి. ఇంట్లో పనులు చేయాలి అన్న మాట స్కూలుకెడితే మరచిపోవాలి. ఇంతేనా? మణి హృదయంలో అన్నీ ప్రశ్నార్థకంగా మెదిలాయి. ఈగోల పోవాలంటే చదువు మానేయాలి "అయ్యో!" చిన్నగా మూలిగింది మణి.

చేతుల్లోంచి భారతి టేబుల్ మీదికి జారిపోయింది. మణి కుర్చీలో వొరిగిపోయింది. భారతి బొమ్మల పుస్తకాలు చూసి, సంతోషంతో నవ్వి పుస్తకాలన్నీ విసిరికొడ్తోంది. టిక్ టిక్ మని గడియారం చప్పుడు పసిహృదయానికి సంతోషాన్నిచ్చింది. గడియారం చేతుల్లోకి తీసుకుని,



మణి పుస్తకాలు తీసుకోపోయింది. "చదువుమానేస్తున్నావు. మాతో నీకేమవసరం?" అని అవి అంటున్నట్లు కన్పించాయి.

## రాబోవు ఆటల పోటీకి



# అమృత్

రక్త శుద్ధి ద్రావకము.

ఛాంపియన్ షిప్ పోటీలలో శ్రమకరమైన ఆటలను, ఉద్రేకపూరితమైన క్షణాలను, నిబ్బరంగా అలసట పొందకుండా నెగటానికి అతడికి సహాయపడుతుంది

353 A E

**కేసరికుటీరం లిమిటెడ్, రాయపేట, మద్రాస్.**

ఒరిస్సా, నైజామ్స్, మైసూరు, ఆంధ్రజిల్లాలకు, తమిళనాడుకు ఏజెంట్లు :
సీతారామా జనరల్ స్టోర్సు.
బరహంపూరు – సికిందరాబాదు,
బెంగుళూరు – బెజవాడ – మధుర.

## నారసింహ లేహ్యము

బంగారు చేర్చబడినది. మేహము, నికార్శ్యక, నిస్సత్తువ, శుక్ల నష్టమును హరించి బలమును, కాంతిని, వీర్యవృద్ధిని కలిగించు వరప్రసాదము—

0 తు॥ డబ్బి రు. 3-4-0 పోస్టేజి 12 అ.
టి. సి. ఏ. &కంపెని. "ఆయుర్వేదసమాజం"
పెరిదేపి-నెల్లూరు జిల్లా.

## వాయిదాల మీద సైకిళ్లు

రు. 1,86,000/- ల విలువగల సైకిళ్లు డిలివరీ అయినవి. ఆఖరుదఫా, ఆశాభంగంపొందవద్దు.

ఈ అపూర్వ అవకాశాన్ని వినియోగించుకొనండి. మొదటి వాయిదాతో 25%, మిగిలినది 6 నెల సరి వాయిదాలలో. చెల్లింపవలెను.

హింద్ సైకిలు రు 138-0-0. ఇంగ్లీషు సైకిలు రు 180-0-0. ఫిలిప్సు రు 210-0-0. హెర్క్యులిస్ రు. 220-0-0. బి యస్. ఎ. రు 246-0-0. ర్యాలి గ్రీన్ రు 340-0-0. డైనమో సెట్టు రు. 28/-

షరతుల ప్రకారం వెంటనే డెలివరీ తీసికొనండి. మీ పూర్తి అడ్రెసు, మీ సమీపపు రైల్వేస్టేషన్ తెలుపుడు. సరి క్రొత్తసరుకులు, డన్‌లప్ టైర్లు, ట్యూబులతో అసలైన క్రొత్త భాగములు గ్యారంటీ ఇవ్వబడినవి. మీ ఆర్డరు వెంటనే పంపండి.

**MIDLAND TRADING CO., LTD.**
**P·BOX·16605·CALCUTTA – 4**

## డి. డి. మలాం

గుడ్డలకు మరకకాదు వెంటనే శమనపరచును, చర్మం పగుళ్లు, కురుపులు, గజ్జి, తామర మొదలైన వాటికి ప్రశస్తమైన చికిత్స.

సోల్ ఏజంట్లు :
**మహాత్మా & కంపెనీ**
జోరాసంకో, కలకత్తా 7.

డిస్ట్రిబ్యూటర్లు
**రాజా మెడికల్ స్టోర్సు,**
విజయనగరం సిటీ

REGD. NO. C.D.L. 511.

## రు. 1-14-0 లు మాత్రమే పెట్టుబడి పెట్టి రు. 1024/-లు సంపాదించండి

వివరములకు వ్రాయండి.

**ఇండియన్ నేషనల్ పాలిసీ కంపెనీ**
(Money Circulating Scheme)

పో. బా. నం. 889 జి. పి. ఒ. కలకత్తా 1,

స్థాపితము — 1935

ఇండియాలో ఇటువంటి కంపెనీలలో ఇదే మొదటిది. స్థాపింపబడినప్పటినుండీ ఈ కంపెనీ ఎక్కువపేరు ప్రఖ్యాతులతో ప్రజలకు సేవ చేయుచున్నది.

నవ్వుతూ పైకెత్తి పోయేసరికి జారి మణిమీద పడిపోయింది. మణి ఉలిక్కిపడి గడియారం టేబుల్ మీద పెట్టి, క్రిందపడివున్న పుస్తకాలన్నీ తీసి కిటికీలో పెట్టింది. భారతిని టేబుల్ మీది నుంచి క్రిందికిదించేసరికి, అది పెద్దగా ఏడ్వడం సాగించింది. మణి ఎత్తుకున్నా, పుస్తకాలు చూపిస్తూ ఏడుస్తూనే వుంది.

మంగమ్మ పూజ చాలించి, నరసింహావతారమెత్తి, చరచర మణిచేతుల్లోంచి భారతిని లాక్కుంది. భారతి పుస్తకాలు చూపిస్తూ ఇంకా హెచ్చుస్థాయిలో ఏడుస్తోంది. "ఆ పుస్తకాలిందాక టేబుల్ మీద వున్నాయిగా, కిటికీలో కెలా వచ్చాయి? పుస్తకాలు తీసికొంటూంటే లాక్కుని వుంటావు. చూడు చంటిదాని చేతు లెలా కమిలిపోయాయో! నాకు తెలుసు నివ్వేదో వక ఘనకార్యం చేస్తావని. గిల్లేనా ఏడ్పించవూ! నువ్వేమైనా తక్కువదానివా?" అంతులేని ఆవేశంతో అంది మంగమ్మ.

"అదికాదు నాయనమ్మా పుస్తకాలన్నీ విసిరికొట్టూంటే, తీసి కిటికీలో పెట్టాను." జంకుతూ చెప్పింది మణి.

"అలా చెప్పు, చిన్నపిల్లను కూర్చోపెడుతున్నాం కదా, పుస్తకాలక్కడవుంటే తెలియక చించేస్తుందని తెలియదూ? నీకేంలే! మహారాజు! మీనాన్న పాతవిపోతే కొత్తవి తెస్తాడు. ఆ పుస్తకాలు డ్రాయరులో పెట్టుకోకూడదూ, టేబుల్ మీద పెట్టకపోతే? దాన్నేడిపించాలనీ నీయెత్తు! అవునా?" ఇష్టమొచ్చినట్లు తిట్టిపోస్తోంది మంగమ్మ.

మణి కుమిలిపోయింది, జవాబేమి చెప్పాలో అర్థంకాలేదు. నాయనమ్మ ఊరుకోదు, ఎనిమిదిన్నరయింది. స్కూలుకు టైమవుతోంది

"స్కూలుకు పోవడానికి పుస్తకాలు టేబుల్ మీద పెట్టాను." అప్రయత్నంగా అనేసింది మణి.

మంగమ్మకు కోపమెక్కువయింది. "జవాబు చెప్పేంతదానివయ్యావుటే? ఆ స్కూలొకటి దాపురించింది నీకు. ఆ పుస్తకాలు చదివి పాసుకాకపోతే ఫరవాలేదులే." హైలైతే నేనా మణి చదువు మాన్పిస్తారని మంగమ్మ ఆశ.

"అలాగేఅంటారు, హైలైతేడబ్బుకుడబ్బాపోయి,పనికి పనీ పోయి హైలైపోయావుటే అనిమీరేఅంటారు." మొండి ధైర్యం తెచ్చుకుని అంది మణి.

"ఏమిటే నీ వెళసరపు మాటలు, నీ వెళసరం నాదగ్గర చూపకు, ఎవరిదగ్గర నీ ఆటలు సాగుతాయో వాళ్ళదగ్గర ఆడు. అసలు నీకు భయమూ, భక్తీ అంటూవుంటే కదా? నోరుకి కూడా కొంత అదుపూ, ఆజ్ఞ వుండాలి. నాకేం అడ్డు లేదని, నీ యిష్టం వచ్చినట్లు మాట్లాడితే పడేవాళ్ళెవరూ లేరు. వాడి కొక లెక్క చెప్పమన్నాను కాని నీతో వాదానికి రాలేదు. నే నేదో అన్నట్లు పోట్లాట కొస్తున్నావే? నాకు బుద్ధులు చెప్పొచ్చావా? ఇక ఫరవాలేదమ్మా. ఏదో సామెత చెప్పినట్లుంది, ముందొచ్చిన చెవులను, వెనుకొచ్చిన కొమ్ములు వెక్కిరించాయట. పెద్దదాన్ని చెప్పాననుకోక, నాకు నీతులు గరపబోతోంది. ఆహా! ఈ కాలంవాళ్ళకు ఏం తెలివి! పుస్తకాలు చదివి పుట్టెడు బుద్ధులు నేర్చుకొన్నారు, అంతకన్నా ఇంకేం కావాలి!" వెటకారంగా అంది మంగమ్మ.

మణి ఎత్తిపొడుపుల్ని సహించలేకపోయింది. ఏదో అనబోయేసరికి, మొన్న మేష్టారమ్మ క్లాసులో చెప్పిన మాటలు, టకీమని జ్ఞాపకానికి వచ్చాయి. ప్రతి ఒక్కరికీ ఓర్పు ఉండాలి. ఓర్పు లేకపోతే జీవితరేఖ వంకర తిరుగుతుంది. కోపంగా వున్నవారి జీవితం ఎప్పుడూ సుఖవంతం కానేరదు. ఎంతటి కష్టాలలోనైనా, ఓరిమి, శాంతి అవసరం. మణి అనబోయే మాటమ్రింగేసింది. నాయనమ్మ పలికిన ప్రతివక్కమాట ములుకులాగుచ్చుకుంది. ఓర్పుతో వాటిని తీసెయ్యాలి. మనసువాటిని వదలడం లేదే? ఏం చెయ్యాలి? దీనంగా మంగమ్మ కళ్ళలోకి చూసింది. కొరకొర చూస్తూ వెళ్లిపోయింది మంగమ్మ. జాలికూడా లేదు.

గాలి జోరుగా కొట్టోంది. జుట్టు లేగి కళ్ళలో వడుతోంది కిటికీ తలుపు టక్కుమని కొట్టుకుంది. పుస్తకాలన్నీ ఎగిరిపడిపోయాయి. మణి ఆలోచనకు అంతరాయం కలిగింది. పడిపోయిన పుస్తకాలన్నిటినీ తీసి టేబుల్ మీదపెట్టి, గడియారం చూసింది. తొమ్మిదయిందే! స్కూలుకు పోవాలి! మనసు అన్నం మీదికి పోవడంలేదు. ఆకలసలే లేదు. నీరసంగా కాళ్ళీడ్చుకుంటూ వంటయింట్లోకి వచ్చింది మణి. జయమ్మగారు వెనక్కు తిరిగి చూచి, "కాళ్లు ఈడ్చుకుంటూ రావద్దని ఎన్నిసార్లు చెప్పానే మణీ. ఆడపిల్ల కుండవలసిన లక్షణాలు ఒకటీలేవే నీకు"అంది. మణిపీటవేసుకుని కంచం కడుక్కుని, మంచినీళ్లు పెట్టుకుని కూర్చుంది. తన తల్లి ఏమంటున్నదో వినే స్థితిలో లేదు. మనసంతా వికలమైపోయింది.

"ఏమిటే అలా వున్నావు, ఎప్పుడూ దిగాలుగా వుండకపోతే ఖులాసాగా వుండరాదటే?" మణిరెండేసి మెతుకులు కతికడం మొదలుపెట్టింది.

"విన్నావుటే జయమ్మా నీ కూతురి మెట్టవేదాంతం? ఈ కొంపలో ఒక్క నిముషం నేనుండలేనమ్మా. నాకూతురి దగ్గర కెడతాను. మారాజమ్మ నిక్షేపంలా అన్ని సౌకర్యాలూ చూస్తుంది. వెళసరపు మాటలూ, మూతి విరుపులూ ఏమీ లేకుండా పోతాయి. సుఖంగా కృష్ణా రామా అంటూ కాలం వెళ్లబుచ్చుకుంటాను. ఆపిల్ల నెత్తుకో మన్నందుకే ఇంత రాద్ధాంతమైంది? రేపు నామతిచెడి ఇంకేదేనా పని చెప్తే, గొంతు పిసికి అవతల పారేస్తారు. నా పిచ్చికానీ ఆ రెండు ఇంగ్లీషుముక్కలు నేర్చుకుంటే మాలాంటివాళ్లు కన్పిస్తారా? వాళ్ళ అమ్మా, నాన్నా వుండగా నేనెవర్ని చెప్పడానికి? ఇంతెందుకమ్మా నాకొడుకొచ్చేక చెప్పిపోతాను, అయినా వాడికేమిటి చెప్పేది నా వెర్రికాని." మంగమ్మ చెవికోసిన మేకలా అరుస్తూ వెళ్లి బయట అరుగుమీద కూర్చుంది.

జయమ్మకు ఇది వినేసరికి అరికాలిమంట నెత్తికెక్కింది. "మణీ నీ లాంటి తెలివితక్కువదాన్ని నేనెక్కడా చూడలేదే? ఎన్ని సార్లు చెప్పాను పెద్దవాళ్లతో పోట్లాడకూడదని? ఒకర్ని చూసేనా నేర్చుకోవు. ప్రక్కింటి వాళ్లరాజ్యలక్ష్మి చూడు ఎంత బుద్ధిగా వుందో. ఆ పిల్లను చూస్తుంటే ముచ్చటేస్తుంది. ముఖంలో ఎప్పుడూ లక్ష్మి తాండవమాడుతూ వుంటుంది. మనమొహాన ఒక్కరోజైనా సంతోషం వుందిగనుకనా? చదవంగానే సరా? ఆ లక్ష్మికి ఏమంత గొప్ప చదువొచ్చు? అసలు ఎక్కువ చదువుకుంటేనే చెడిపోతున్నారు తే. లక్ష్మికి ఏం నేర్పించారుగనక, అంత తెలివితేటలు? జాకెట్లు కుడుతుంది. బనీనులు అల్లుతుంది, లేసులు అల్లుతుంది,పాటలుపాడ్తుంది. రామాయణం, భారతం,ఎంతచక్కగా చదువుతుంది. దమ్మిడీ ఖర్చుకాకుండా ఆడపిల్ల చేయాలిసిన పనులన్నీ నేర్చుకుంది. అన్ని విధాలా ఆ లక్ష్మి బాగుపడ్తోంది. మన కారాతవుండాలిగా! నెలనెలా బోలెడంత డబ్బుపోసి ఆ చదువు వెలగబెడ్తూంటే మాట్లాడటమే చేతగాకపోతే మిగిలిన వేమి చేస్తావు? మీనాన్నగారికేనా చెప్పాలి, ఈవెధవ చదువుమాన్పించమని. అప్పుడు కాని తిక్క కుదరదు. నాకుచేతికి కొంత సాయంగా వుంటావు." జయమ్మ మణికి బుద్ధులు గరిపి అత్తగారిదగ్గరకెళ్లి, "దాని

మాటలకేం లెండి, మీరు చెప్పిన పని చేసేస్తాను, అప్పుడుకాని బుద్ధివచ్చేట్టు లేద"ంటూ, ప్రక్కనే కూర్చుంది.

మణి చెవులు గింగురు మన్నాయి. ఇప్పటి దాకా నాయనమ్మగోల, తరవాత అమ్మగోల. ఎవరో్న పొగుడుతూ, తన్ను తిడుతూంటే ఎవరి మనసొప్పుకొంటుంది? మణిమాత్రంఓర్చుకో గలిగింది. కాని చదువు మాన్పించేస్తారుట. అదే ఓర్చుకోలేని బాధ. "ఏమైనా సరే నీ చదువుమాన్పించేస్తాను," అన్న అమ్మ మాటలు పదే పదే జ్ఞాపకానికొచ్చి హృదయంలో వ్యథకలిగింది. తర్వాత ఏం చెయ్యాలి? ప్రశ్న రాగానే స్పృహతప్పినట్లయింది. మంచినీళ్లు త్రాగాలని గ్లాసు ఎత్తుతూంటే జారి అన్నంలో పడింది. నీళ్లన్నీ అన్నంలో దొర్లాయి, చప్పుడు విని జయమ్మలోపలికొచ్చి, పిచ్చిదానిలా వున్న మణినీ, నీళ్లుకలిసిన అన్నమూ చూసేసరికి జయమ్మకు జాలివేసింది. ఇంతకుముందు తనన్నమాటలు గుర్తుకొచ్చాయి. మణి హృదయంలో చెలరేగుతున్న తుఫాను వెంటనే కనిపెట్టేసింది ఆ మాతృహృదయం. మనసంతా పశ్చాత్తాపముతో నిండిపోయింది. జాలిగా "మణీ"అంది. మణి తలెత్తి చూసి మళ్లీ వంచేసింది.

గబగబా లేచి కంచంలో అన్నంఒకక్క కేసి, కంచం కడిగి తెచ్చి ఇంట్లోపెట్టి, పీట ఎత్తి, ఇల్లు తుడిచేసి బరువైన హృదయంతో వెళ్లి తనగదిలో కుర్చీలో కూలిపోయింది మణి. జయమ్మకు ఏమనడానికీ నోటెంట మాటరాలేదు. అలా శూన్యంలోకి చూస్తూవుండిపోయింది.

"అక్కయ్యా ఇంకెప్పుడూ చెప్పనే" విచారంగా అన్నాడు మురళి.

"నీదేం తప్పంది మురళీ, తప్పంతా నాదే".

"అక్కయ్యా నువ్వెంత మంచిదానివి. నన్నించేకదూ, అందరూ నిన్ను తిట్టారు. స్కూలుకు టైమైంది నువ్వెళ్ళవూ"

"నేను మంచిదాన్ని కదూ? అవును అందరూ అదే అంటున్నారు, నీవు తప్ప. బలేవాడివిరా" మణిమందహాసం చేసింది.

"అదేంటి, అక్కయ్యా" మణికళ్లలోకి బెదురుగా చూశాడు మురళి."

?ఏం లేదురా, నాస్కూలు కేంగాని నువ్వుపోలేదేం?"

"లెక్కలు చెయ్యకపోతే మాష్టారుకొడతారనిపోలేదక్కయ్యా?"

"నే లెక్క చెప్తే వెళ్లే వాడివికదూ? నాయనమ్మ చెప్పింది నిజమే. నన్నించే నీ చదువు పోతోంది."

"అక్కయ్యా అవేం పిచ్చిమాటలు"

"ఒరే మురళీ అన్నానికి రారా" జయమ్మ కేక వేసింది. మురళి వెళ్లిపొయ్యాడు.

గోడగడియారం అరగంట కొట్టింది. స్కూలుకుపోవాలి. ఎలాపోవడం? బలహీనంగావుందే? పోకపోతే ఇంకా ఏవైనా తిట్లు మిగిలితే అవి కూడా తిని పోవాలి. "ఏమైనా సరే నీ చదువు మాన్పించేస్తాను."

అన్న అమ్మ మాటలు గుర్తుకొచ్చాయి. ఎవరో తన్ని హింసిస్తున్నారు. వాళ్లెవరో తన్ను బ్రతకనివ్వరు. చదువుమానేస్తే? కళ్లుతిరిగాయి. తలటేబుల్ మీదకువొరిగింది. సరస్వతీ దేవి పటానికి వేసిన మల్లె పూలమాలటేబుల్ మీద పడింది. మణి మాలను చేతిలోకి తీసుకుని, కళ్లకద్దుకొని పటానికి వేసింది. దీనంగా సరస్వతీ దేవిని చూసింది. తను నవ్వుతూన్నా, ఏడుస్తున్నా, ఆ తల్లి నాకేమన్నట్లు నవ్వుతూ వీణవాయిస్తూ వుంటుంది. తన విచారం, కష్టం, చదువు, బాధ, ఏడ్పు ఆమెకు వినిపించవు. "ఏమైనా సరే చదువు మాన్పించేస్తాను" అన్న మాటలుకూడావినిపించవా? తనకే ఆమాటలు బాధను కలిగిస్తాయి, మరెవ్వరికీ కష్టాన్ని కలిగించవు తన నాయనమ్మకుమాత్రం సంతోషాన్నిస్తాయి. 'ఇంతేనా నీ దయ' అన్నట్టుగా సరస్వతీ దేవి కళ్లలోకి చూసింది మణి.

పది గంటలు కొట్టింది. మణి పుస్తకాలు తీసుకోపోయింది. "చదువుమానేస్తున్నావు. మాతో నీకే మవసరం? మమ్మల్ని తాకకు, నీలాంటివాళ్లు మమ్మల్ని ఉపయోగిస్తే మా గౌరవం పోతుంది" అని అంటున్నట్లు కన్పించాయి.

లేనిబలం తెచ్చుకుని, పుస్తకాలు తీసుకుని నిలుచుంది. కళ్లు చెమ్మగిల్లాయి. అశ్రువులు తెలియకుండా రాలుతున్నాయి. కాళ్లు తేలిపోయాయి. చేతిలోని పుస్తకాలు జారిపొయ్యాయి. పడమటిగాలి జోరున వీస్తోంది. గోడకు తగిలించిన సరస్వతిపటం ఒక్క వూపులో క్రిందపడి ముక్కలు ముక్కలైంది. మల్లె పూలమాల మీదపడింది. మాల వురిత్రాడులా కన్పించింది. కెవ్వున కేకేసి పడిపోయింది మణి. గడియారం పదకొండు కొట్టింది. అమ్మ వాళ్లు చూడకుండా లేవాలనుకుంది. కాని ఓపిక లేదు. విరిగిన మనసూ, పగిలిన పటమూ, తెగిన మాల కన్పిస్తున్నట్లైంది. సరస్వతీ పటం పడిపోవడం తన చదువుపోయిన దానితో సమానం. అన్నీ అశుభాలే. అబ్బా! అరమోడ్పుకన్నులతో నేలనంటుకొని పడివుంది. మళ్ళీ గాలి జోరున వచ్చింది. కుర్చీ మణికాలుమీద పడింది.

"అమ్మా"పెద్దగా అరిచింది మణి. గుమ్మంలో రిక్షా ఆగిన చప్పుడైంది. భోజనానికి ఆఫీసునుంచి నాన్నగారొస్తున్నారు. ఏమిటని అడిగితే ఏంచెప్పాలి. మెల్లిగా కుర్చీ అవతలకు నెట్టింది. తల నొప్పిగా వుంది. కళ్లు తిరిగాయి, ప్రాకుతూ కుర్చీ దగ్గరచేరింది. రామారావుగారు అరుపువిని, ఆదుర్దాగా లోపలకొచ్చి, మణిని చూసి ఆశ్చర్యపొయ్యారు. గదంతా కలయచూశారు. పితృప్రేమ పిల్లు బికింది. విషాదంగా "మణీ" అన్నారు. మణి పలకలేదు. కుర్చీలో కూర్చోపెట్టారు.

"ఏమిటమ్మా ఇదంతా, అలావున్నావేం? స్కూలుకు పోలేదేం'' ప్రశ్నల వర్షం కురిపించారు. మణి "నాన్నా" అంటూ ఆగిపోయింది.

"వీళ్లంతా ఏరి? నువ్విలావుంటే ఒక్కరేనా రాలేదూ? మురళీ! మురళీ! కేకేశారు" రామారావు. వేపచెట్టుకింద గోలీకాయ లాడుకొంటున్న మురళి పరుగెత్తుకుంటూ వచ్చి చూసి, "అక్కయ్యా నన్నించే కదూ నీకీ అవస్థ పట్టింది" అన్నాడు దీనంగా. మణి చిన్నగా నవ్వి "ఎందుకురా, అలా వాపోతావు, నాకేం బాధలేదులే. నువ్వసలేం చేశావు గనక? తప్పంతా నాదే" బుజ్జగిస్తూ అంది.

రామారావుగారికి అర్థంగాక అయోమయంగా అన్నారు— "నాయనమ్మా అమ్మా, భారతీవీరీ? ఎక్కడ కెళ్లారు?"

"ప్రక్కింటివాళ్ల రాజ్యలక్ష్మి రామాయణం చదువుతూంటే వినడానికి వెళ్లారు, నాన్నగారొస్తే చెప్పమన్నారు. అక్కయ్య స్కూలుకెళ్లిందనుకుని వేపచెట్టుకింద ఆడుకొంటున్నాను" బిక్క మొహం పెట్టి భయపడ్తూ చెప్పాడుమురళి.

"అసలుసంగతి చెప్పరా" కఠినంగా అన్నారు రామారావు. జరిగినదంతా పూసగ్రుచ్చినట్లు చెప్పేశాడు మురళి. రామారావు కళ్లు పెద్దవిచేసి, పళ్లు పట పట కొరికారు "ఓరేయ్ మీ అమ్మా వాళ్లను పిలుచుకురారా" కోపంగా అన్నారు. మురళి మెల్లిగా లేచాడు. రామారావుగారికి ఏదో జ్ఞాపకానికొచ్చి, "మురళీ ఈ రూపాయితీసుకుని ఏవేనా పండ్లుతీసుకురారా" అన్నారు. మురళి డబ్బు తీసుకొని జేబులో వేసుకొన్నాడు.

జయమ్మను చూసి రామారావు ఉగ్రుడైపోయారు. ఎన్నిసార్లు చెప్పాను, చదువు విషయం తలపెట్టవద్దనీ, పనిచెప్పవద్దనీ? బుద్ధిలేదూ?

ఇద్దరూ కలిసిదాన్ని చంపేస్తున్నారు. మీరు మణిని బ్రతకనివ్వరు. మణి చదవడమే మీకిష్టంలేదు. చదువంతా నాశనం చేస్తున్నారు. ప్రొద్దస్తమానం మీ తిట్లతోనే సరిపోతుంది." కోపంలో ఏదేదో అనేస్తున్నారు రామారావు. జయమ్మకేం అర్థం కాలేదు. కుర్చీలో వాలిపోయివున్న మణి పై దృష్టి మళ్ళింది. భర్త మాటలు లెక్క చెయ్యకుండా ఒక్క వుదుటునమణిని హృదయానికద్దుకొంది. తల్లిప్రేమ మణి కర్థమైంది. తల్లికళ్ళల్లోకి చూస్తూ "అమ్మా" అంది. జయమ్మకు ఉదయం జరిగిన సంఘటన కళ్ళ ముందు గిర్రున తిరిగినట్లయింది. అన్ని తిట్లు తిన్న మణిమనస్సెట్లావుండాలి? కోపంలో తానేదేదో అనేసింది. "నిన్నేమీ అనను మణీ" తల నిమురుతూ అంది జయమ్మ.

రామారావుగారి కోపం, పటాపంచలైంది. అన్నిటికీ కారణం తన తల్లి అని అర్థమైంది. మణి హృదయానికి శాంతి కలిగింది. తన చదువు గురించి ఇంట్లో ఎంతగోలయింది! తండ్రిచెప్పించిన బిస్కట్లు, బత్తాయి పండు తింది. గడియారం పన్నెండు గంటలు కొట్టింది. ఈపూట స్కూలుకు పోవాలి. మురళి క్రిందపడిన పుస్తకాలన్నీ తీసి మణి కిచ్చాడు. మణి పుస్తకాలు డ్రాయరులో పెట్టి టైమ్ టేబుల్ చూసి పుస్తకాలు తీసుకుని కూర్చుంది. జయమ్మ ఈ పూట వద్దులే అనాలనుకొని, మళ్లీ సర్దుకుని, "ఏమండీ అన్నానికిరండి" అంది. రామారావు దొడ్లోకిపోయి కాళ్లుచేతులు కడుక్కుని వంటింట్లోకొచ్చి పీట మీద కూర్చున్నారు. గంట పన్నెండే. ఇప్పుడు పోతే స్కూలు వదలరు. మధ్యలో పోవాలి. స్కూలుకు పోయే తోవలో స్నేహితురాలు సూర్యప్రభ ఇంటికిపోతే? బాగుంటుంది. సూర్యప్రభ వచ్చేక ఇద్దరూ కలసి వెళ్ళొచ్చు. అప్పటిదాకా వాళ్లరేడియో పెట్టుకోవచ్చు.

స్కూలుకు పోవాలని నిర్ణయానికొచ్చి "మురళీ నేను స్కూలు కెళ్లానని చెప్పరా" అంటూ అడుగులో అడుగువేస్తూ పుస్తకాలు చేతబట్టి గడపదాటింది మణి. మురళి అక్కయ్య కు చూస్తూ వుండిపోయాడు.

"రామాయణం ఎంత బాగాచదివిందే లక్ష్మి. మనింట్లో అమాత్రం రామాయణం చదివి వినిపించలేరుగా? నా మనుమరాలు చదువుతోందనడానికి సిగ్గేస్తోంది." దొడ్లో అరుగు మీదకూర్చుంటూ మంగమ్మ సాగతీసి చెబుతున్న మాటలు జయమ్మా, రామారావూ విన్నారు.

"నేనేం చేయనండీ! తప్పంతా నాదేనంటారు. ఆవిడ నేమన్నా అంటే కోపం వస్తుంది. మణి నేమన్నా అంటే అది బాధపడ్తుంది. మధ్యలో ఇరుక్కు చస్తున్నాను." అత్తగారికి వినపడుతుందేమో నన్నట్లు నెమ్మదిగా చెప్పింది జయమ్మ.

రామారావుగారు అసలే ముక్కోపి. తల్లిగారి మాటలు వినేసరికి ఆగ్రహం వచ్చి, తినే తినే అన్నం వదిలేసి దొడ్లోకొచ్చి చెయ్యి కడుక్కున్నారు. జయమ్మ ఏమీ అనలేక చూస్తూ నిల్చుండి పోయింది.

కొడుకుని చూసి, "ఒరే రాముడూ నా మాట విని నా గ మణి ని స్కూలు మాన్పించరా. అది బాగుపడ్తుంది. వాళ్ళ రాజ్యలక్ష్మి చూడరా ఎంత మంచి పేరు తెచ్చుకుందో?" తనపట్టే నెగ్గాలన్నట్లుగా అంది మంగమ్మ.

"దానిచదువుమాట ఎత్తొద్దని ఎన్ని సార్లు చెప్పాను. నాకూతుర్ని నేనెట్లయినా చేసుకుంటాను నా యిష్టం. పెద్దదానవైనకొద్దీ, బుద్ధి మారుతూందేం? మీ కంతకష్టంగా వుంటే దానికి వేరే రూమ్‌చూసి అక్కడే అన్ని ఏర్పాట్లూచేసి చదివిస్తాను. ఇదే నా నిశ్చయం. ఇం కెప్పుడేనా దాని చదువు మాట ఎత్తేరంటే ఆ పని చేసితీరుతాను. నీ కంతగా వినాలనివుంటే మణికి ఫిడేలు నేర్పిస్తాను. అంతేగాని దాని చదువుమాత్రం మాన్పించను ఎంతవరకు చదివితే అంత వరకూ చదివిస్తాను. మణి చదువే మింగయ్యేదులే మన డబ్బంతా. డబ్బంతా చదువుకవుతోందని కదూ మీకీ కుళ్లు?

కోపాన్నంతా కక్కేసి రామారావు త్వరత్వరగా హాల్లో కెళ్లి కుర్చీలో కూర్చున్నారు. "నాన్నా! అక్కయ్య స్కూలుకెళ్ళానని చెప్పమంది" అన్నాడు మురళి.

తాంబూలంతెచ్చి టేబిల్ మీదపెడుతూ, "మణి ఏదండీ" అని అడిగింది జయమ్మ.

తాంబూలం వేసుకుంటూ "మురళితో చెప్పి స్కూలు కెళ్లిందట." అన్నారు.

"అప్పుడే ఏం బడండీ పన్నెండేగా గంట?"

"స్కూలుకెళ్ళేతోవలో కృష్ణమూర్తి గారింటికి వెళ్తుంది. వాళ్ళమ్మాయి సూర్యప్రభ, మణీ క్లాస్ మేట్స్."

"ఓహో! కృష్ణమూర్తిగా రమ్మాయా? వాళ్లకు 60 ఎకరాలున్నాయిట, రేడియో కూడా వుంది, తల్లిలేదుగా పాపం? అన్నీ వాళ్ళ అక్కయ్యే చూస్తుంది. మొన్న దసరాలకు పేరంటాని కెళ్లినపుడు చూశాను. ఫిడేలుకూడా నేర్చుకుంటోంది. ఆ రోజు పాడింది. మణి చాలడబలాటపడింది ఫిడేలు నేర్చుకోవాలని. కాని మళ్లీఎప్పుడూ ఆమాట ఎత్తనేలేదు ఎందుచేతోగాని. గోడ కానుకుని కూర్చుంటూ అంది జయమ్మ."

"ఆచదువే సాగనివ్వరు మీరు, ఇంక ఫిడేలు నేర్పిస్తారాఅనుకోనుంటుంది. మణిది చాల తెలివైన బుర్ర. దాన్ని బాగా చదివిస్తే తప్పక మనకు మంచిపేరు తెస్తుంది. ఈమధ్య మీగోల వినలేక మనోవ్యాధి పట్టుకుంది. మొహంచూస్తే తెలియడంలేదూ? కృష్ణమూర్తి గారితో మాట్లాడి, ఫిడేలు ఏర్పాటుచేస్తాను. ఏమంటావు?"

"అలాగేనండీ"

మణి నేరుగా సూర్యప్రభ యింటికి వెళ్లింది. ఫిడేలు వాయిస్తున్న ప్రభనుచూసి ఆశ్చర్యంతో "స్కూలు కెళ్ళలేదా ప్రభా?" అంది. ఫిడేలు క్రింద పెట్టి మణినిహాల్లోకి తీసుకుపోయింది ప్రభ. "మార్నింగ్ నువ్వొస్తావని చూస్తూ వుండిపోయ్యాను. ఎంతకీ రాలేదు, లేటుగా పోవడ మెందుకని మానేశాను మణీ..."

"నన్నించి నువ్వు కూడ మానేశావన్న మాట! ఏమీ తోచక ఫిడేలు వాయిస్తున్నావు అంతేనా ప్రభా?" అంది మణి.

రెండుగంటలకి మణీప్రభా బుజాలమీద చేతులేసుకుని స్కూలుకి వెళ్లారు. సగం దూరంపోయేసరికి స్కూల్లో, టంగ్ టంగ్ మని గంట కొట్టారు. గబగబావెళ్లి క్లాసులోవాళ్ళ వాళ్ల సీట్లలో కూర్చున్నారు. హిందీ మాస్టారమ్మ వచ్చి హిందీ చెప్పి వెళ్లింది. మణికి ఒక్కటీ అర్థం కాలేదు. మనసు పరిపరివిధాల పోతోంది. తనెందు కిలాబాధపడాలి? ఏదోతనకు తెలియనిబాధ రగులుతోంది. అటు చెప్పలేక ఇటు చెప్పలేకతల్లి విచారిస్తోంది. అన్నిటికీ తనే కారణం. కళ్ళలో నీరు తిరిగింది. కళ్లనీళ్ళను అణచడానికి ప్రయత్నించింది. అదిస్కూలన్న విషయం జ్ఞాపకానికొచ్చింది తనకుతానే సిగ్గుపడింది. మణి చాలా బాధపడ్తోంది. ప్రాణస్నేహితురాలుగా ఎంచుకుంటున్న మణి బాధపడ్తూంటే ఓర్చుకోలేక పోయింది ప్రభ. మణి బాధ ఏమిటో ప్రభ కర్థంకాలేదు. అడిగితే రెచ్చగొట్టినట్లవుతుందేమో? ఏమిచెయ్యాలి? ప్రొద్దున స్కూలుకు రాకపోవడానికి, మణి బాధకు సంబంధం వుండాలి. మునుపటిలా ఇంట్లో ఏమైనా అన్నారా? అయితే అయివుండాలి. లెక్కల మేష్టారొచ్చారు. రెండు లెక్కలు హోంవర్కుకు ఇచ్చి మొన్నటివీ ఈరోజువీ రఫు లెక్కలపీరి

(54-వ పేజీ చూడండి)

# ఆగస్టు 7 వ తా॥ నుండి

# ముగ్గురు కొడుకులు

(తెలుగు)

| | | |
|---|---|---|
| విజయవాడ | — | సరస్వతీ పిక్చర్ ప్యాలెస్ |
| గుంటూరు | — | సరస్వతీ పిక్చర్ ప్యాలెస్ |
| ఏలూరు | — | కేసరి పిక్చర్ ప్యాలెస్ |
| భీమవరం | — | శ్యామల టాకీస్ |
| విశాఖపట్నం | — | మినర్వా టాకీస్ |
| విజయనగరం | — | మినర్వా టాకీస్ |
| రాజమండ్రి | — | మినర్వా టాకీస్ |
| కాకినాడ | — | పూర్ణా థియేటర్ |
| తెనాలి | — | సత్యనారాయణ టాకీస్ |
| బళ్లారి | — | ప్రభాత్ టాకీస్ |
| కర్నూలు | — | చాంద్ టాకీస్ |
| కడప | — | సరస్వతీ టాకీస్ |
| సికిందరాబాదు | — | రాజేశ్వరీ టాకీస్ |
| హైదరాబాద్ | — | సాగర్ టాకీస్ |
| వరంగల్లు | — | మార్కండేయ టాకీస్ |
| చిత్తూరు | — | ప్రేమల టాకీస్ (అరణం) |

త్వరలో : నెల్లూరు, మచిలీపట్నం, అనంతపురం, నంద్యాల, రాయచూరు.

## జెమినీ చిత్రము






అన్నయ్యా,

నీవు నా ఉత్తరం చూసి ఆశ్చర్యపోతావు. కలలో కూడ ఎన్నడూ అనుకోని ఒక విపరీత ఘటన జరిగిపోయినట్లుగా కంగారుపడతావు.

నా జీవితంలో ఇంతకుపూర్వం నేనెప్పుడూ ఉత్తరాలు రాయలేదు... కాని ఈనాడు, అసంభవమనుకున్న ఘటనలన్నీ జరిగిపోయిన తరువాత ఆపుకోలేని ఆవేదనతో నీకు నేనీ లెటరు రాస్తున్నాను.

అన్నా,

అందరు స్త్రీలలాగే నేనూ ప్రపంచానికి ఒక క్లిష్టసమస్యను-ఆడబిడ్డ కలిగితే తల్లిదండ్రుల నవనాడులూ కృంగి కండ్లు చీకట్లుకమ్మే సంఘంలో నేను పుట్టానని గుర్తుంచుకో అన్నయ్యా.

ఈవిషయం రాస్తూంటే నా కెందుకో చిన్ననాటి సంగతులు ఒక్కొక్కటే గుర్తొస్తున్నాయి. మనిద్దరం చాల రోజులవరకూ ఒకే స్కూలులో చదువుకున్నాం. కొంచెం పెద్దవాళ్లమయాక నువ్వు పెద్ద చదువులకోసం కలకత్తా వెళ్లిపోయావు. కాని నేను స్త్రీని-ఎక్కువ చదువెల్లా చదువుతాను? ఇంట్లోనే పాకమహారాజ్యానికి పట్టమహిషి నయ్యాను.

నువ్వు నా కుత్తరం రాయవు-నేను నీకు రాయను. మన వంశంలో పెద్దలదగ్గరనుండి మనకు సంక్రమించిన కులమర్యాద మితభాషిత్వం. నువ్వూ, నేనూ, అక్కయ్యలూ, అమ్మ, నాన్న అందరం అదే పద్ధతిని అనుసరించాం. ఇంట్లో ఉన్నప్పుడు కూడ మనం ఒకరితో ఒకరం అట్టే మాట్లాడుకోం-దూరంగా ఉన్నప్పుడూ ఎక్కువగా ఉత్తరాలు రాసుకోం.

వంశగౌరవం నిలుపుకోడంకోసం మనలో ప్రతిఒక్కరం ఉరిపెట్టుకోడానికి కూడ సంసిద్ధులంగా ఉంటాం. ఆ గౌరవం ఎల్లాంటిది? తలుచుకుంటే నవ్వొస్తుందిప్పుడు-స్త్రీజనాన్ని కాపలా కాసుకోటమే ఆ గౌరవంయొక్క ముఖ్యఉద్దేశ్యం! స్త్రీలు తమ్ము తాము కాపాడుకోలేరు! పెంపుడు జంతువులను కాపాడినట్లు వాళ్లను కాపాడాలి!

నీకూ కొంతవరకు ఈ భావాలే ఉన్నాయి. నీ భార్యను ఇతరులెవరూ చూడకుండా ఉండేందుకు తాపత్రయ పడతావు నువ్వు. ఇవన్నీ రాస్తూంటే నీకు కోపం కూడ వస్తుంది. నిన్ను అందరూ 'మగవాడు వాడికేం' అంటారు. నువ్వు చదువుకొని

ఉద్యోగం చేస్తావు. నీ భార్య నీకు అడ్డమైన చాకిరీచేస్తూ వంటవండిపెడుతుంది.

ఆవేగాన్ని ఆపుకోలేకపోతున్నాను— అక్కయ్యలిద్దరిగతీ ఏమైంది? వాళ్ళ జీవితాలావిధంగా కొరగాకుండా పోవడానికి బాధ్యు లెవరు?—స్పష్టంగా కనిపిస్తోనే వుంది.

పెద్దక్కయ్య నిజంగా భూదేవిలాంటిది కాదూ? ఓర్పుకీ సహనశక్తికీ ఆమె పెట్టిందిపేరు. వంశమర్యాదకోసం కుటుంబగౌరవంకోసం ఆమెని ఒక కులపెద్దయొక్క వ్యర్థప్రతిష్ఠకి కట్టబెట్టారు—ఆ వ్యక్తి కులప్రతిష్ఠ ఎట్టిది? త్రాగుబోతుతనం—జూదరితనం—కసాయివానిలా అక్కయ్యని పట్టుకుని కొడుతూండటం! ఇంత చేసినా అక్కయ్య నోరు మెదిపి ఎరగదు. తన భర్త అభిజాత్యాన్ని చాటుకుంటూ తిరుగుతుంది. ఆమె కన్నీరు కార్చడం నేనెప్పుడూ చూచి ఎరగను. ఎంతో సంతోషంగా ఉన్నట్టు నటిస్తుంది. మన మెప్పుడేనా వాళ్ళ ఇంటికి వెడితే బావ చర్యలు మన మెక్కడ కనిపెట్టిపోతామో అని కంగారుపడుతూ వుంటుంది. అక్కయ్యకి ఈ గుట్టూ మర్యాదా ఎవరు నేర్పారు? మన కులమర్యాదే కదా? కాని ఈ కృత్రిమ కులమర్యాదవలన ఆమె ఏమి సుఖం పొందకలిగింది? బావ అక్కయ్యను అల్లా పట్టుకుకొడుతూవుంటే నాకు వంటినిండా తేళ్లూ, జెర్రులూ పాకినట్టయేది. 'అదే నేనయితేనా'......అంతకంటె ఆనాటి నా చిన్ని హృదయం ఆలోచించలేకపోయింది. కాని...ఈరోజు నేనేమయాను?

తరువాత చిన్నక్కయ్యను కూడ ఆ త్రాగుబోతువాని తమ్మునికే కదూ ఇచ్చి అంటగట్టారు? చిన్నక్కయ్య సౌందర్యం, ముగ్ధత్వం ఎవ్వరిని ఆకర్షించవు? ఏమంత గొప్పసాంప్రదాయకమైనసంబంధం మించిపోతోందని అక్కయ్య నతని కిచ్చారు? అంత అసహ్యంగానూ వుండే చిన్నబావ బంగారుతీగెలాంటి అక్కయ్యకి చుట్టూ బానిసత్వమనే ఇనుపకంచె వేసేశాడు. ప్రేమ అంటే ఏమిటో తెలియని ఆ భర్త జీవితంలో చిన్నక్క కూడ భాగస్వామిని కావలసివచ్చింది. ఆయన చెప్పిందల్లా వేదవాక్కుగా పరిగణించడానికి ఆమె బాధ్యురాలైపోయింది.

సంఘం ఇద్దరి అక్కయ్యలమీదా సానుభూతి కనపరుస్తుంది. కులగౌరవాన్ని నిలబెట్టారని వారిని అభినందిస్తుంది. కాని ఈ శుష్కసానుభూతివల్ల ఏం లాభం?

అయితే ఇక మిగిలింది నేను—అందరిలో చిన్నదాన్ని—అక్కయ్యల మార్గాన్నే 'తుచ' తప్పకుండా అనుసరించవలసినదాన్ని. ఖర్మ చాలో చాలకనో అక్కయ్యలకంటె ఎక్కువ చదువుకొని ఉండటంవల్ల నన్ను గురించి నాకు ఎక్కువ తెలుసునేమో. అమ్మా నాన్నా అక్కయ్యలు—వీళ్లే నా జీవితసౌధానికి పునాదులు. ఇల్లూ ఇంట్లోని వ్యక్తులూ తప్పితే వేరే ప్రపంచం నాకు తెలియదు. బడికి మాత్రం వెళ్ళేదాన్ని. అప్పటి నా శరీర బలం చూసి మిగత పిల్లలంతా ఆశ్చర్యపోయేవారు. సిల్కుగౌను గాలికి టపటపా కొట్టుకుంటూవుండగా లేడిపిల్లలా పరుగెత్తుతూ వుంటే నన్నెవరూ పట్టుకోలేకపోయేవారు. నా కాళ్లలోని ఆనాటి పదునంతా ఏమైపోయింది ఈనాడు?

బడిలో నువ్వూ నేనూ ఒకే క్లాసు చదివేవాళ్ళం—కాని మన మెప్పుడూ ఒకళ్లతో నొకళ్లం మాట్లాడుకునేవాళ్ళం కాదు. నువ్వంటే నేను విపరీతంగా భయపడేదాన్ని. మన ఇంట్లో పెద్దవాళ్లు చిన్నవాళ్ళమీద, ఆ చిన్నవాళ్లు అంతకంటే చిన్నవాళ్లమీద అధికారం చలాయిస్తూండటం పరిపాటే కదా?

బడిపిల్లలంతా నాటకాలు వేస్తూంటే నువ్వూ వాళ్ళతోపాటు వేస్తూండేవాడవు. నాకూ వేషం వెయ్యాలని ఎంతో ఉత్సాహంగా ఉండేది. కాని నేను వెయ్యలేకపోయేదాన్ని. నువ్వు నాటకంలో అభినయం చేస్తూంటే నేను ఉత్సాహం పట్టలేకపోయేదాన్ని. నా అన్న చాలా గొప్పవాడని సంతోషించేదాన్ని, ఎంతో గర్వించేదాన్ని. ఈనాడైతే ఈర్ష్య కలిగేదేమో! ఇప్పుడవన్నీ తలుచుకుంటూంటే చాలా ఆవేదన కలుగుతోంది.

నువ్వూ నేనూ ఒకే తల్లిదండ్రులకి పుట్టాం. కాని మన జీవితాలలో ఎందుకింత వ్యత్యాసం ఏర్పడింది? నువ్వు మగమహారాజువి - నేను ఆడదయ్యాన్ని!

ఆడవాళ్ళకి జ్ఞానం ఉండదని మీరంతా చాల ఈసడింపుగా చూస్తారు. అవును. ఎక్కడినుంచి వస్తుంది మాకా జ్ఞానం? ఇంటి నాలుగ్గోడలూ దాటి బయటికెప్పుడేనా వెళ్లే వీలుంటేకదూ మాకు? ఎంత చదువుకున్నా, మా బ్రతుకులు వృథా అయిపోయేట్లా చేశారు. లైబ్రరీకి వెళ్ళి పుస్తకాలు తెచ్చుకునేందుకు కూడ మాకు అధికారంలేదు. అమ్మకీ నాన్నకీ భయం నాకు పెళ్లికాదేమోనని!

అన్నయ్యా,

నా బ్రతుకు ఎందుకిలా అయిపోయింది? నా అందమంతా అడవిగాసిన వెన్నెలైపోయిందెందుకని? నాయీ భగ్నజీవితానికి బాధ్యులెవ్వరు? నీకు నీవే అజ్ఞ అంటావు నువ్వు - ఎవరి జీవితసమస్యలకు వారే కర్తలని నీ ఉద్దేశ్యం. శుద్ధ పొరపాటు. స్త్రీ విషయంలో ఇట్టిఅభిప్రాయం ఈ రోజున ఎంతమాత్రం వద్దు.

పెళ్ళికాకముందు రోజూ అద్దంలో నేను నా రూపాన్ని చూసుకునేదాన్ని— ఎందుకో తెలుసా? నా స్నేహితులంతగా ప్రశంసించే, కావ్యనాయికాలక్షణాలతో కూడుకున్న నా సౌందర్యప్రభని కళ్ళార చూసుకోవాలని నా కెంతో అభిలాషగా ఉండేది. కోటేరులా చక్కగా ఉందని చెపుతూ స్నేహితులందరూ పట్టుకులాగే నాముక్కుతీరూ, సిగ్గునటించినప్పుడల్లా లేత కుంకుమరంగుతాల్చే నా చెక్కిళ్ల సౌరూ, కమలంతో పోల్చబడే నా ముఖంలో విరిసే అందచందాలూ అద్దంలో చూసుకుంటూ స్నేహితుల ప్రశంసలలోని సత్యాసత్యాల్ని గ్రహించేందుకు నేను రోజూ ఎంతో ప్రయత్నించేదాన్ని.

కాని నేడవన్నీ ఏమయాయి? నా క్షుబ్ధజీవితంలో రేగే ఈ తుపాను - నా శూన్యనేత్రాల్లో ఇంకే ఈ కన్నీరు - ఇవేనా నాకీనాడు మిగిలినవి? నా కులమర్యాద నాకు చేసిన ఉపకారం ఇదేనా? ఇప్పుడు నా చెక్కిళ్ళు సిగ్గుతో ఎర్రపడడంలేదు - కన్నీటి చారికలతో మాసి మలినమవుతున్నాయి. నా పెదవు లిప్పుడు చీటికీ మాటికీ కంపిస్తున్నాయి. నా ముక్కుచివర మొద్దుబారిపోతోంది. నాముఖంలో బేలతనం వచ్చేసింది. ఈ శుష్కనేత్రాలలో నేడు కన్నీరుకూడ కరువైపోయింది.

నేను ఊహించుకున్న సుఖమయ కల్పనలు ఇసుకతో కట్టిన బొమ్మరిళ్లుగా అయిపోయాయి నేను నిర్మించుకున్న ఆశాసౌధాలు గాలిమేడలుగా మారిపోయాయి. స్వప్నమయ దివ్యజగత్తులో స్వేచ్ఛావిహారం సల్పే నా హృదయవిహంగం రెక్కలు తెగిపోయాయి. నా జీవితం మరుభూమిగా మార్చబడి పచ్చిక పట్టనేదే లేకుండాపోయింది.

చదువుమాని నాలుగేళ్ళు ఇంట్లో ఉన్నాను. పదిహేడు సంవత్సరాలు వచ్చాయి. ఈ నాలుగేళ్ళపాటు అమ్మ, నాన్న నా పెళ్ళిసంబంధంకోసం వెతుకుతూనే ఉన్నారు. బహుశః నీవు కూడ ఆ ప్రయత్నం చేసేఉంటావు. అమ్మానాన్నా పెళ్లి బేరాలాడారు. పదివేలు ఇచ్చి అయినా సరే పెళ్లికొడుకుని తెస్తామన్నారు. కాని పెళ్లికొడుకుల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. బేరం కుదరలేదు. నా జీవితాన్ని అటో ఇటో తేల్చ

పారేయగల క్లిష్ట సమస్య - నన్నూ నా వాళ్ళనీ శాశ్వతంగా అగాధంలో త్రోసేయగల ఈ దారుణ సమస్య - ఇది తీరేదెప్పుడు?

నే నెందుకు పుట్టాలి? పుట్టి ఇంత మందిని కష్టసముద్రంలో ఎందుకు పడ త్రోయాలి? ఈ ఆలోచనలన్నీ నన్ను బాధిస్తూనే ఉన్నాయి. కాని నేనేం జెయ్యను?

ఆఖరికి నా జీవితం తొలకరిమబ్బులలో కలసిపోయేరోజులు రానేవచ్చాయి. నా పెళ్లి కాబోతున్నది. ఎవరితో? - ఒక అగాధశూన్యత్వంతో, అమ్మ నాన్నా ఎంతో సంతోషించారు. పెళ్ళికొడుక్కి ఆస్తి చాలా ఉంది. అయితే అతనికి విద్యా? శూన్యం. తెలివి తేటలా? పూజ్యం. సౌందర్యమా? నాస్తి. ఇంక మిగిలినది ఏమిటి? డబ్బుడబ్బు. ఈతో ఏం జేయాలి? పెళ్లికి నగలు చేయించుకోవచ్చు, విలువైన బట్టలు కొనుక్కోవచ్చు. నేను మహాగొప్ప దానినని సంతోషించవచ్చు.

నాకు కాబోయే భర్త గొప్పతనాన్ని గూర్చి నా కిదివరకే పరిచయముంది. ఆగుణగణాలన్నీ చూసి ఒకప్పు డతనిని మూర్ఖశిఖామణిగా కట్టి ఏడిపించినవాళ్ళలో నేనూ ఒకదానినే. ఈ రోజు అతని కర్ధాంగిని కాబోతున్నాను.

అన్నా,

నేనీ వివాహం ఇష్టమయే చేసుకున్నా ననుకున్నావా? నేను నాస్థానంలో ఉండే ఈ విపరీత వివాహాన్ని వ్యతిరేకించడానికి సాయశక్తులా ప్రయత్నించాను. నాన్న బల్లగుద్ది ప్రశ్నించాడు-"ఇంకా నే నెక్కడి నుండి సంబంధాలు తేను?" నా హృదయంలో ప్రళయ సముద్రఘోషలు ప్రతిధ్వనించాయి. నాన్న ప్రశ్న కేమి జవాబివ్వను? ఆయన ముఖం చూడలేక అమ్మ చెంత తలదాచుకుని ఏడ్చాను.

నాదృష్టి కందినంతవరకూ నలువైపులా పరికించి చూశాను— చదువుకున్న వాళ్లని పెళ్లిచేసుకోవాలంటే కట్నాలు విపరీతంగా పొయ్యాలి. నాన్న భరించలేడు. పోనీ ఆస్తి సరిసమానంగా పంచి ఇవ్వగలడా అంటే, అందుకు మనస్సొప్పదు.

సుడిగుండంలో ములిగేందుకు తయారుగా వున్న ప్రాణిలా కళ్ళు మూసుకుని కర్తవ్యాన్ని పూర్తిగా విస్మరించాను. వివాహ ఘడియలు సమీపిస్తున్నాయి. విప్రుల వేదఘోషల మధ్య— మేళతాళాల గల్లంతులో కూర్చుని, ఇతనినేనా నేను వివాహమాడవలసింది? వీళ్లంతా కలిసి నన్నూ ఇతనినీ అగ్నిసాక్షిగా వివాహ బంధనంద్వారా విడరాని జంటగా తయారు చేస్తున్నారు—భవిష్యత్తులో నే నేమవుతాను? మూర్ఖుని భార్య మూర్ఖురాలేకదా? నా గతీ ఇంతేనా అన్నయ్యా?

నువ్వూ పెళ్లికొచ్చావు. నేను కనిపెడుతూనే వున్నాను. నా పెళ్లి చూడలేక నువ్వు బయటికి వెళ్లి కూర్చున్నావు.

నా వివాహం జరిగింది—నాజీవితంలో ఒక క్రొత్త అధ్యాయం ప్రారంభమవుతున్నది.

ఈ అధ్యాయంలో పున్నమినాటి వెన్నెలలు విరియబూయడం లేదు.

అమావాస్యనాటి చీకటితెరలు ఒక్కటొక్కటే క్రమ్ముకొస్తున్నాయి.

నీ చిట్టిచెల్లెలు

.........



సీరియల్ నవల

# రెండు మహానగరాలు

చార్లెస్ డికెన్స్

## 25

స్వర్ణోజ్జ్వలములైన సాంధ్యారుణ కిరణాలు పడమటి కొండ చాటున మరుగు పడిపోయినై. అప్పుడప్పుడే గగనపథానికి లేస్తున్న చంద్రుని చల్లని కిరణాలు ఆకుల సందునుంచి వాళ్ళయిద్దరి ముఖాలమీదనూ పడుతున్నయ్. డాక్టర్ మానెట్ కుమార్తెతోసహా పెరటిదొడ్లోవున్న పచ్చని చెట్టుక్రింద కూర్చునున్నాడు. ఇద్దరిముఖాల్లోనూ ఆనందం జిలిబిలిగా చిందులాడుతోంది.

మర్నాటి ఉదయమే లూసీ వివాహం జరుగుతుంది. అంచేత ఆ సాయంత్రమంతా లూసీ తండ్రితో గడపటానికి నిశ్చయించుకుంది. వాళ్ళిద్దరూ ఏకాంతంగా కూర్చుని కులాసాగా కబుర్లాడుకుంటున్నారు.

'నాన్నా!—నీకు సంతోషంగా వుందా?'

'చాలా సంతోషంగా వున్నానమ్మా!'—

'నాకూడా అలానేవుంది నాన్నా! చార్లెసుకు నామీద అలాంటి అనురాగం కలగటం నాకెంతో ఆనందంగా వుంది. కాని ఈ వివాహంవల్ల నేను నీకు దూరంకావలసిన పరిస్థితివస్తే నాకెంతో బాధగావుండేది. ఇప్పుడుకూడా నాకెందుకో...'

మాట్లాడలేకపోయింది; లేచి వెళ్ళి పసిబిడ్డలా తండ్రి భుజంమీద పడుకుని, ఆయన ముఖంలోకి తొంగిచూస్తూ!

'చెప్పు నాన్నా!—ఇప్పుడు చెప్పు—ఈ వివాహంవల్ల నీనుంచి నేను దూరమయ్యే పరిస్థితి యేమీ రాదని నీకు గట్టిగా నమ్మకం వుందా లేదా? అలాంటిది యేమీ రాదని నాకు తెలుసు; నీ మనసులోకూడా అలాంటి నమ్మకంవుందా లేదా అని తెలుసుకోవటానికి అడుగుతున్నాను.'

చిరునవ్వు నవ్వుతూ ఎంతో ఆనందగా సమాధానం చెప్పాడు: 'ఉన్నది తల్లీ సంపూర్ణమైన విశ్వాసంవుంది—' కుమార్తెను ఆప్యాయంగా ముద్దుపెట్టుకున్నాడు. 'అంతేకాదు తల్లీ! నీ వివాహంవల్ల మునపటికంటే నా రోజులు ఇంకా ఎంతో ఆనందంగా గడుస్తాయనే అభిప్రాయంకూడా కలుగుతోంది—నా జీవితంలో ఎన్నడూ యెరగనంత ఆనందాన్ని అనుభవించబోతున్నాననుకుంటున్నాను—'

'నిజంగా అలాంటి అభిప్రాయం నీకువుంటే...'

'నమ్ముతల్లీ! నిజం చెబుతున్నాను. నీకు తెలీదుగాని—ఇంతకంటే నాకింకేమి గావాలితల్లీ! నాకు సేవచేస్తున్నానని నువ్వు ఆనందపడుతున్నావుగాని, నాకోసం నీ జీవితమంతా వ్యర్థమైపోతోందంటే లోలోపల నీకోసం నేనెంత ఆందోళన పడ్డానో నీకేం తెలుసు?'

ఆ మాటలు ఆయన నోటినించి రాకుండా అడ్డటానికి లూసీ అరచేతితో తండ్రి నోరు మూసెయ్యటానికి ప్రయత్నించింది. ఆయన ఆ చేతిని ఆప్యాయంగా తన చేతిలోకి తీసుకుని:

'అవునమ్మా! వ్యర్థమైపోవటంగాక మరేమిటి?—జీవితంలో సహజంగా అనుభవించవలసిన సుఖదుఃఖా లన్నిటికీ దూరమై నువ్వు నాకోసం, అసిధారావ్రతంగా ఇలా బ్రతుకుతూ వుండటమంటే యేమిటి? నీకు నామీద వుండే ప్రేమచేత అంతా సరీగానే వుందని అనుకునేదానివిగాని, నీ వలా వుంటుంటే నా మనసులో ఎంత దిగులుగా వుండేదో నీకేం తెలుసు? నువ్వే ఆలోచించు: నువ్వు జీవితంలో యే సుఖమూ అనుభవించటం లేదని తోస్తే నే నెలా సుఖంగా బ్రతకగలను? నేనేకాదు—ఏ తండ్రి మాత్రం?'

'నిజంగా చార్లెస్ నా కంటబడకుండా వుంటే—నీతో నేను హాయిగా బ్రతకగలిగిగే దాన్నే నాన్నా!'—

చార్లెస్ లేకపోతే తన జీవితానికి ఆనందంలేదనే విషయం అనుకోకుండా బయటపడిపోయింది. ఆ వెర్రిమాట విని తండ్రి చిరునవ్వు నవ్వాడు:

'తల్లీ! చార్లెస్ నీ కంటబడనూ పడ్డాడు—నీకు దక్కనూ దక్కాడు! చార్లెస్ కాకపోతే మరొకరయ్యేవారు. స్త్రీవయి పుట్టిన తరువాత జీవితంలో యెవరో ఒకర్ని ప్రేమించకుండా ఎలా వుంటావ్?—అలా ప్రేమించకుండా వుంటే, దానికంతకూ కారకుణ్ణి నేనే అయ్యేవాణ్ణి; అంతకంటే దురదృష్టం నా జీవితంలో మరొకటుండేదా?'

డాక్టర్ మానెట్ తాను అనుభవించిన కష్టాలను గురించి యెప్పుడూ పల్లెత్తైనా మాట్లాడేవాడు కాదు. ఆక్షణంలో ఆయన ఆవిషయం ప్రసంగించటానికి ఉపక్రమించటంతో లూసీకి పట్టరాని ఉత్కంఠ కలిగి మౌనంగా కూర్చుని వింటోంది.

'చూడు లూసీ—ఆ చంద్రబింబంవంక చూడు!—నేను జైల్లో వుండగా, జైలు కటకటాలలోనుంచి ఇలానే చూస్తూ వుండేవాణ్ణి; నాకు దక్కకుండాపోయిన నా మధురజీవితంమీద ఆ చంద్రుడు ప్రకాశించుతున్నాడనిపించేది. ఆ వెలుగు చూడలేకపోయేవాణ్ణి. ఆ ఇనప కటకటాలకేసి తల పగులగొట్టుకునేవాణ్ని. అయోమయమై పోయేవాణ్ని; ఆ అయోమయావస్థలో నిర్జీవాలైపోయిన కళ్ళతో ఆ చంద్రుడివంక దిగాలుపడి చూస్తూ కూర్చునేవాణ్ణి; ఆ చంద్రబింబంలో నానుంచి దూరంచేయబడిన నా పసిబిడ్డ ముఖాన్ని ఊహించుకునేవాణ్ణి; ఆ బిడ్డ మగబిడ్డయితే పెద్దవాడయి నాపగ సాధించుతాడని ఆశపడేవాణ్ణి. నేను జైల్లోవున్న రోజుల్లో, కొన్నాళ్ళు, పగ సాధించాలనే కోరిక నాలో భరించరాని ఆవేశంగా జ్వాలలు రేగుతూవుండేది. ఒకవేళ ఆ

అనువాదం: తెన్నేటి సూరి

# ఈ ఉపఖండమందంతట ప్రతి నలుగురిలో ఒకరు మలేరియా జ్వరపీడితుడైయుండును

ఒకక్షణ మాలోచించిన, సంఖ్యారూపముగా ప్రతి సంవత్సరము పది కోట్లమంది మలేరియాతో బాధపడుచున్నారని తేలగలదు.

పొరబడకండని హెచ్చరిక—మలేరియా నిస్సత్తువజేయు ఘోరమైన జాడ్యము. ఆరోగ్యమును, బలమును ధ్వంసము చేయును. వైజ్ఞాని కోద్రేకముల మందపరచును.

'పాలుడ్రిన్' లోగల మలేరియా నిరోధించు సుగుణములను నేడే పొందమని మేమింత నొక్కి చెప్పెడ మందులకే. 'పాలుడ్రిన్' యొక్క నిరపాయకరత, సులభసేవన వాడుటకెంతో అర్హమైనది. నిన్ను నీవు మలేరియా బారినుండి కాపాడుకొనుటకు వారమున కొక మాత్ర ఒక అణా ఖర్చుతో సేవించిన చాలును. సేవించు విధానము దిగువున తెలుపబడియున్నది.

మలేరియా రోగకారణమైన దోమ ఒక కాటుతో మలేరియా క్రిములను నీ రక్తములో ప్రవేశపెట్టును. యెప్పుడును యేటవాలుగా మూగు ఆ దోమను నీవు సులభముగా గుర్తింపగలవు. వీటి అభివృద్ధి కాధారమైన నీటి నిలువలు ఇండ్ల పరిసరాలలో వుంచకుండిన మలేరియా బారి నుండి తప్పుకోగలరు. నిదురించునపుడు దోమతెరను వాడుడు. దోమలను చంపుటకు 'గమెక్సేన్' క్రిమికీటక సంహారిణిని మీ గృహములయందు చల్లియుంచుడు.



## యీ అపాయకర చిహ్నములను గమనింపుడు:

మొదట చలిచే వణికించును, జ్వరము తగిలి చెమటలు పోయును. దేహమంతట నొప్పులు, తీపులు పుట్టును. యీ సూచనలను అశ్రద్ధ చేయక తక్షణమే వైద్య సలహా తీసుకొనుము. అప్పుడు నీకు మలేరియా సోకయున్న 'పాలుడ్రిన్' సేవించిన కొద్ది రోజులలో నయమగును. యికముందు రాకుండుటకు, అది ఎట్లు తోడ్పడ గలదో కూడ వైద్యుడు నీకు తెలియపరచును. స్వచ్ఛమైన 'పాలుడ్రిన్' వుల్లిపొర కాగితములలో ఆరోగ్య విధానముగా సీలు చేయబడినవే దొరుకును. మాత్ర ఒకటి ఒకణా మాత్రమే.



# 'పాలుడ్రిన్'

## మలేరియాను తరిమివేయును




సేవించు విధానము

చికిత్సకొరకు: పదివయసుగలవారు, 12 యేండ్లకు మించినవారు ఒక మాత్ర వాడవలెను. 6 నుండి 12 సంవత్సరములలోగల పిల్లలకు అర్ధ మాత్ర. 6 సంవత్సరముల వయస్సు మించని పిల్లలకు పావుమాత్ర చొప్పున ప్రతి దినము జ్వరము తగ్గువరకు యివ్వవలెను.

రక్షణార్థం: మోతాదు పై కనుపరిచినట్లే కాని వారమున కొకమారు నిర్ణీతమైన దినముననే సేవించుచుండవలెను.

'పాలుడ్రిన్'ను భోజనానంతరం సేవించి జలమునైనను, పాలనైనను దారాళముగా త్రాగవలెననునది జ్ఞాపకముంచుకొనవలెను.




ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ (ఇండియా) లిమిటెడ్

బిడ్డకు నా అంతూపంతూ తెలియక నా అంతటికి నేనే తనను వీడి వెళ్ళిపోయానని అనుకుంటూ డేమోనని బెంగపడేవాణ్ణి: మొగ పిల్లడు కాకుండా ఆడపిల్లయితే పెరిగి పెద్దదై, బిడ్డలుతల్లి అవుతుందని కలలుగనేవాణ్ణి. ఆ కూతురు నా సంగతేమీ తెలియకుండానే పెరిగినట్టూ—దానికి పెళ్లయినట్టూ—దాని భర్తకుకూడా నా సంగతేమీ తెలియనట్టూ మానవజాతిలో నా చరిత్ర విస్మృతమై పోయినట్టూ, అనుకునేవాణ్ణి.'

'నాన్నా! నీవు యెన్నడూ యెరగని ఆ బిడ్డమీద అలాంటి మమకారంతో వుండేవాడివని వింటుంటే—నాకు ఎంతో యిదిగా వుంది'—

'అవును తల్లీ! నువ్వు నన్ను ఈవిధంగా ఉద్ధరించి ప్రజల్లో పడేశావు గనకనే—ఈవేళ నాకీ కథంతా జ్ఞప్తిరావటానికి ఈ మాటలు నీతో చెప్పుకోటానికీ ఆస్కారం కలిగింది—ఆఁ!—ఏమిటే? ఇప్పుడు నేను చెబుతున్న సంగతేమిఁటే?'—

'ఆ బిడ్డ నీ సంగతే తెలుసుకోలేకపోయింది నాన్నా! నీకోసం రవ్వంతైనా తాపత్రయ పడలేకపోయింది'—

'ఆఁ!—ఇంతకీ చెప్పొచ్చిం దేమిఁటంటే—ఒకోనాడు అలా చంద్రుడిలోకి చూస్తుంటే ఒక చిత్రం జరిగేది. ఆ బిడ్డ చంద్రుడిలోనుంచి దిగి జైల్లోవున్న నాదగ్గిరికి వచ్చినట్టూ, నన్ను జైల్లోనుంచి తప్పించి బయటికి తీసుకుపోతున్నట్టూ మనసుకు తోచేది. ఆ రూపం కళ్ళకుకట్టినట్టు నాకట్టెదుట కనిపించేది. ఇప్పుడు నువ్వు నా యెదట యెలా కనుపిస్తున్నావో సాక్షాత్తూ అలానే కనుపించేది! అయితే కావిలించుకుందామంటే అందేది కాదు. ఎప్పుడూ అల్లంతదూరంలో నిల్చుని వుండేది—అబ్బా! ఆ సంగతులన్నీ నీకు అర్థంకావుతే లూసీ—ఇలాంటివన్నీ నీకు అర్థంకావాలంటే ఒంటరిగా జైల్లో నీవు కూడా చాలాకాలం వుంటేగాని కుదరదు'—

ఆయన యిదంతా ఎంతో ప్రశాంతంగానే చెబుతున్నా, ఆ విషాదగాథ వింటూంటే లూసీ రక్తనాళాలన్నీ చల్లబడిపోతున్నయ్.

'లూసీ! మరో సంగతేమిటంటే! ఆ బిడ్డ పెరిగి పెద్దదైంది. పెళ్లి చేసుకుంది. భర్తతో కాపురం చేస్తోంది. ఒకనాడు వచ్చి నన్ను తన యింటికి తీసుకువెళ్ళింది. తమాషా చూశావ్!—ఆ ఇంట్లో ఎక్కడ చూసినా నాసంగతే—గోడమీద నా ఫొటో వుంది. ప్రార్థనల సమయంలో నాకోసంకూడా ప్రార్థనలు చేస్తున్నారు. ఆబిడ్డ జీవితం ఎంతో ఆనందయుతంగానూ, ప్రయోజనకరంగానూ సాగిపోతోంది. కాని చూచావ్—నా విషాద చరిత్ర ఆ ఆనంద జీవితాన్నంతా పొగలా అలుముకుపోయింది—'

'ఆ బిడ్డను నేనేనాన్నా! ఆ సద్గుణాల్లో నాకు సగమైనా లేవు—'

'ఇంకా చూశావూ! తన బిడ్డల నందర్నీ నాకు చూపించింది. నన్ను చూసి జాలిపడటం వాళ్లకు నేర్పింది. ఆ పిల్లలు ఏ జైలుముందు నుంచైనా వెడుతున్నారనుకో—ఆ జైలు కటకటాల వంక చూసి, తమలో తాము ఏదో గుసగుస లాడుకునేవాళ్లు; ఇంత చేసినా నన్ను ఆ జైల్లోనుంచి యేనాటికీ విముక్తి చేయలేకపోయేది. ఇలాంటివన్నీ చూపించి, యెప్పటికప్పుడు, నన్ను ఆ జైలు కటకటాల వెనక దిగవిడిచి వెడుతూవుండేది. ఆ వెడుతున్న బిడ్డను చూసుకుని నాలో యేదో వెర్రిఆనందం కలిగేది. కళ్లవెంట నీళ్లు రాలేవి. జైలు కటకటాల వెనకే మోకరిల్లి ఆ బిడ్డను రక్షించమని భగవంతుణ్ని ప్రార్థించేవాణ్ణి'

'ఆ బిడ్డను నేనే నాన్నా!—నాన్నా! రేపు ఉదయం నన్ను మళ్లా, అంత మహాప్రేమతోనూ నాన్నా!'

'లూసీ! యివన్నీ నాకు యిప్పుడు ఎందుకు జ్ఞాపకంవస్తున్నాయనుకున్నావ్. నీవంటే నామనస్సులో ఎంత ప్రేమవున్నదో మాటల్లో చెప్పటానికి సాధ్యంకాదు. నాకు ఈవేళ యింత ఆనందాన్ని అనుభవించే అవకాశం కలగజేసినందుకు భగవంతుడికి ఎన్నో నమస్కారాలు చెప్పుకుంటున్నాను—'

లేచి కుమార్తెను కావిలించుకున్నాడు. ఆబిడ్డను తనకు యిచ్చినందుకు భగవంతుడికి నమస్కారం చేశాడు. ఆబిడ్డను సర్వదా రక్షించుతూ వుండమని ప్రార్థించారు. ఇద్దరూ కలిసి నెమ్మదిగా ఇంట్లోకి వెళ్ళిపోయారు.

వివాహానికి లారీగార్ని ఒక్కర్ని మినహా మరొకరెవర్నీ పిలవలేదు. మిస్ ప్రాస్ మినహా మరొక తోడుపెళ్లికూతురుకూడా యెవ్వరూ లేరు. పెళ్ళిఅయినతరవాత కూడా, ఇల్లూగిల్లూ మార్చేదిలేదు. ఆయింట్లోనే వుంటారు. లేకపోతే పై అంతస్థులో యింకా మరి రెండుగదులు అదనంగా అద్దెకు తీసుకున్నారు.

ఆసాయంత్రం తండ్రీ కూతురూ, మిస్ ప్రాస్ ముగ్గురూ కలిసి భోజనం చేశారు. భోజనానంతరం, లూసీ తన గదిలోకి వెళ్లిపడుకుంది. డాక్టర్ కూడా తనగదిలోకి తాను వచ్చేసి నిశ్చింతగా గుండెలమీద చెయ్యి వేసుకొని నిద్రపోయాడు.

తెల్లవారుఝామున దాదాపు మూడుగంటలు కావచ్చింది. లూసీకి తండ్రిమీద యెందుకో జాలివేసింది. మెట్లుదిగి తండ్రి గది దగ్గిరికి వచ్చి లోపలికి తొంగిచూచింది.

ఆయన నిశ్చింతంగా పడుకుని నిద్రపోతున్నాడు. నెమ్మదిగా లోపలికి అడుగులు వేసింది. గాఢనిద్రలో మునిగివున్న ఆయన నుదురును ముద్దుబెట్టుకుంది. పిల్లికూనలా మళ్ళీ నెమ్మదిగా బయటికి వెళ్ళిపోయింది.

# ది పూర్ణా పి

విజయవాడ .. గుంతకల్ .. సికిం

స్వాతంత్ర ది

త్వరలో

తె

చిత్ర



త్రిమూర్తి వారి

**చిన్నమ్మ** కథ..

డైరెక్టర్.... S.V.S. రామారావు

కృష్ణకుమారి.... శివరావు

గోవిందరాజుల సుబ్బారావు

శేషమాంబ....



రోహిణీ వారి

**ప్రతిజ్ఞ**

డైరెక్టర్.... Y. R. స్వామి

పర్యవేక్షణ.... H. M. రెడ్డి

సావిత్రి.... గిరిజ...

కాంతారావు...



గజానన ప్రొడక్షన్స్ వారి

**కోడరికం**

డైరెక్టర్... కె. రామచంద్రరావు

S. వరలక్ష్మి.... గిరిజ...

రామచంద్రకాశ్యప - రేలంగి



మనోహర వారి

**మనోహర్**

డైరెక్టర్..... ప్రసాద్

T. R. రాజకుమారి

నాగేశ్వరరావు

హిందీ చిత్రములు

**ఆంధియాన్**

నిమ్మి... దేవ్ ఆనంద్

**అంజామ్**

వైజయంతిమాల

ప్రేమ్‌నాథ్

డైరెక్ట

## క్చర్స్ లిమిటెడ్

రాబాద్ .. విశాఖపట్నం .. మద్రాసు

రాభివందనములు

సమర్పించు

ంగు

ములు



రోహిణీ వారి

**LEGACY**

డైరెక్టర్.... D.L. రామచందర్

పర్యవేక్షణ...H.M. రెడ్డి

సావిత్రి....సూర్యకాంతం

మధు... కాంతారావు..



మోడరన్ థియేటర్సు వారి

**సవతిపోరు**

డైరెక్టర్... మస్థాన్

జానకీ..



పిక్చర్స్ వారి

**దేశి**

ర్...ప్రసాద్

...నాగేశ్వరరావు

గారావు..



ఎం.ఆర్.ఎ.వారి

**లేడీడాక్టర్**

డైరెక్టర్.శ్రీధర్

కృష్ణవేణి... విజయకుమార్

కథ.... శాంతి



మనోహర పరిమళ వారి

**ముక్తిమార్గం**

డైరెక్టర్.... కాశీలింగం

పద్మిని.... అంజలీదేవి



వారి

న్ నెం **2.**

...కృష్ణస్వామి

...జయమ్మ

రాయి...వేకేటి

హిందీ చిత్రములు

**షిన్‌షినాకీ బూబ్లాబూ**

రెహానా.... రంజన్

**చంచమాచం**

రెహానా.... కిశోర్

## REDUCED PRICES



ALL SWISS WATCHES.
Guaranteed
5
YEARS

ALARM-TIME PIECE (ENGLISH)..16/-
-DO- SUPERIOR QUALITY ........19/-
RAILWAY POCKET WATCH. (A)...10/-
-DO-SUPERIOR RADIUM...........12/-



(4) 15 JEWELS R/GOLD 42/SUPERIOR 45/-



(5) CHROME 18/- ROLLED GOLD 20/-
15 JEWELS WATER PROOF C/SECOND 52/-



(6) 4 JEWELS R/GOLD 22/SUPERIOR 25/-
15 JEWELS R/GOLD 40/SUPERIOR 43/-
POSTAGE FREE ON ORDER FOR 2.

**H. DAVID & CO.**
Post Box No 11424, Calcutta-6

---

నేనే స్నాఫ్స్ అంటే
పడ్డలకొట్టే అనాసపిట్ట
మూపుల్లి అంతర్ధానం చేస్తా
పడ్డలకొట్టే పరిణామనూలల్లి
పరుగెత్తిస్తా (నేను కావాలంటే)
తోలేటి ఆంజనేయులు & సన్స్
మారుటేరు, ప.గో.జిల్లా

---

## గనోక్యూర్
అన్నిసెగలకు గంటలలో గుణము
**ఈశ్వర ఫార్మశీ, రాజమండ్రి.**

---

మా ఏజంట్లకు, శ్రేయోభిలాషులకు హృదయ పూర్వక
స్వతంత్ర దిన అభినందనలు.

## ప్రపంచ ప్రఖ్యాత మద్రాసు నశ్యం

★ ★

నాణ్యతయే దానిఘనత



ఒకసారి కొంటే తిరిగి వదలిపెట్టరు

★ ★

నశ్యములలో ఉత్తమమైనది అత్యుత్తమమైనది, పట్నం నశ్యమే. అందరూ కోరునది, కారం, నాణ్యత, సువాసన గలది. **అప్పాదురై నశ్యమే.**

★

**అ. అప్పాదురై ముదలియార్ & సన్**
55, ఆచారప్పన్ వీధి, పోస్టుబాక్సు నెం. 189, మద్రాసు-1.

---

## అబలసుధ
స్త్రీల సమస్తవ్యాధులకు వజ్రాయుధం

స్త్రీల కుసుమవ్యాధులకు చాల ప్రశస్తమైనది. అకాల బహిష్టు ఋతురక్తము బాగుగా జారీకాక పోవుట, లేక మిక్కుటముగా స్రవించుట, ఋతుశూల, యోనిశూల, ఒడలు నొప్పులు, నడుమునొప్పులు, తలనొప్పులు, గుండెదడ, కాళ్లులాగుట, వెన్నుపూసలో నొప్పి, మనస్తిమితము లేకుండుట, నిద్రపట్టకుండుట, జ్వరము వచ్చినట్లుండుట, పైత్యవికారములు, శరీరము కృశించుట, అరుచి, బలహీనత, మలబద్ధకము, హిస్టీరియా మొదలగు సమస్తవ్యాధులకు ప్రశస్తమైనది. వంధ్యా స్త్రీలు తప్పక సంతానవతులగుదురు. సీసా 1 కి రు. 3-0-0 పోస్టేజి 0-14-0.

ఇండియన్ మెడిసన్ హౌస్ (W), లక్ష్మీటాకీస్ రోడ్డు. విజయవాడ—2.

---

## 4 గోల్డన్ బంగారు నగలు రూ. 5-14-0



స్త్రీలు చూచినయెడల సంతోషపడుదురు. కొత్త అందమైన రకములు, గోల్డన్ బంగారుతో కట్టబడినవి. గ్యారంటీ. ప్రతిదినము ఉపయోగించినను అసలు బంగారునగలవలె ప్రకాశించును. అన్ని మతములవారు ఉపయోగించవచ్చును. ధనవంతులు చాల ప్రీతిగా ఉపయోగించెదరు. 4 ఆభరణములవివరము. ఒక జత బంగారు డైమన్ గాజులు. 1 జత చంద్రలేఖ స్టార్ లోలకులు, 1 డైమన్ 9 రాళ్ల ఉంగరం, 1 సినిమా జ్యోతి నెక్ లెన్ చైను, 4 ఆభరణములు పెట్టెతో సహా రు. 5-14-0. అన్ని ఆభరణములు, ప్రస్తుత నాగరికత ననుసరించియు, రాత్రి కాలమందు రవ్వలవలె ప్రకాశించును.

**సి. సుష్మా అండ్ కంపెనీ, పోస్టుబాక్సు 89, మద్రాసు-1.** (A.P.T)



# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 23. పేపబెత్తము 'రుంయి' మంటుందేం?

తాళాలు వాయించినప్పుడూ, గంట కొట్టినప్పుడూ ఆ వస్తువుల కంపనమువల్లనే శబ్దము పుడుతుందని తెలుస్తుంది. ఇంత వివరంగా తెలియరాకపోయినా, ఏ శబ్దమేనాసరే వస్తువుల కంపనమువల్లనే పుడుతుంది. మెఱుపు మెరిసినప్పుడు గాలి కంపనమువల్ల ఉఱుమూ, మాట్లాడినప్పుడు గొంతుకలోని 'స్వరతంతు'ల కంపనమువల్ల శబ్దమూ పుడుతున్నాయి.

అయితే ఏ వస్తువేనా సెకనుకు 16 మారులు కంపిస్తేగాని ఆ కంపనాలవల్ల గాలికి తగిలే దెబ్బలు శబ్దముగా గాలిలో ప్రసరించవు. అంటే సెకనుకు పదహారు కంటె తక్కువగా వుండే ప్రకంపనాలు శబ్దాల్ని కలిగించలేవు అన్నమాట. పేపబెత్తము విసిరితే 16 మార్లు కాగుగదా నాలుగెదుకి మించి కంపనాలే కనబడవు. అయితే 'రుంయి' మన్న శబ్దము ఎలాగ పుట్టిందీ అని ప్రశ్న.

కంపనాలు రెండు రకాలు. వీణతీగ లాగ తన పొడవుకి లంబముగా లాగబడుట వల్ల పొడవుకి లంబముగానే కదిలి కంపించడము ఒక రకము. రబ్బరుతాడుకి రాయి కట్టి వ్రేలాడదీస్తే రాయి తాడుపొడవు వెంబడే ఊగుతుందే, అవి రెండోరకము కంపనాలు. పేపబెత్తము విసిరితే, బెత్తములోని వస్తువు దాని పొడవు వెంబడే కంపిస్తుంది. ఈ కంపనాలు సెకనుకు 16 దాటి వుంటాయి.



పటములో వరుసగా చేరివున్న గూడ్సు పెట్టెలున్నాయి. ఇప్పుడు దూకుడుగా వచ్చిన ఇంకో పెట్టె ఎడమవైపు తగిలిందనుకోండి. అప్పుడు ఏ పెట్టె కాపెట్టె ముందుకీ వెనక్కీ ఊగిసలాడి నిల్చిపోయినా, దెబ్బమాత్రం పెట్టెనించి పెట్టెకి సాగి, చివ్వరి పెట్టెని విసురుతుంది.

పేపబెత్తము పొడూగునా ఈ పెట్టెల లాంటి పొరలున్నాయనుకుంటే, విసిరినప్పుడు ఆ పొరలు ఈ పెట్టెలలాగే కంపించాయన్నమాట. ఈ కంపనాలు సెకనుకు పదహారు దాటడంచేత ('రుంయి' మనే) శబ్దముగా వినబడ్డాయి.

## 24. చెట్లు పిల్లల్ని పెడతాయా?

పిట్టలూ సరీసృపాలూ, పురుగులూ, గుడ్లు పెట్టి పొదిగి పిల్లల్ని చేసుకుంటాయనీ, మృగాలు పిల్లల్నే కని పాలు కుడుపుతాయనీ మనకి తెలుసును. మొక్కలు విత్తనాల్ని (అంటే ఒక రకమైన గుడ్లని) తయారుచేసి తమ వంశాభివృద్ధి చేసుకుంటాయని కూడా తెలుసును మనకి. అందుకే 'మొక్కలు పిల్లల్ని పెడతాయా?' అన్న ప్రశ్న ఆశ్చర్యముగా వుంటుంది.

ఆశ్చర్యమైతే అయిందిగాని మొక్కలు పిల్లల్ని అంటే చిన్న మొక్కల్ని కాచి రాలుస్తాయన్నమాట కిత్తనార మొక్క పట్ల నిజము. కిత్తనార చెయ్యంత వెడల్పుని బారెడేసి మట్టలున్న డొంక. వెలిబూడిద చల్లినట్టున్న నీలపు మట్టలు అంచులపొడూగునా కొసన ముళ్లతో వుంటాయి. అందుకే డొంకలలోనే పెంచుతారు కిత్తనార మొక్కల్ని. మట్టల మధ్యనించి పొడుగ్గా కాడ బయల్దేరి, దీని కొసని పూలు పూస్తాయి. ఈ పూలు కాయలై, ఆ కాయలోంచి వేళ్ళూ చిన్న చిన్న 'మట్టలూ' పుట్టి, అవి కిత్తనార మొక్కలైనతర్వాత గాని రాలవు. అంటే కిత్తనారడొంక పిల్లల్ని పెట్టి రాలుస్తుందన్నమాటే కదూ?

బురదలో పెరిగే మడచెట్లు కూడా తమ కాయలు వేళ్లుపెట్టి పిల్లమొక్కలైన తర్వాతగాని వాటిని రాల్చవు. విత్తనము మొక్క అవడానికి గాలిలోని ప్రాణ వాయువుని పీల్చుకోవాలి. మడ విత్తనాలు బురదలో పడితే వాటికి ప్రాణవాయువు అంది వేళ్లు రావడానికి అవకాశము లేదు కనక వేళ్లు పుట్టేదాకా విత్తనాలని చెట్లు రాల్చనే రాల్చదు.

## 25. టెలిగ్రాపు స్తంభాలు ఎందుకు మోత పెడతాయి?

మెట్లమధ్య చక్కగా బిగించిన వీణ తీగని మీటినప్పుడు తీగ చేసే వేపనాలు (*vibrations*) మెట్టుద్వారా వీణ కడుపుకి అంది, కడుపూ, దానిలోని గాలీ ప్రతిధ్వనిస్తాయి. అంటే జల్లుమంటాయి. తీగ ఒక్కటే కంపిస్తే మనకి వినబడని నాదము, కడుపులోని గాలి కంపించడము వల్ల గట్టిగా వినబడుతుంది.

టెలిగ్రాపు తీగలు వీణతీగ లనుకోండి. గాలి విసురువల్ల ఈ తీగలు, కదిలి కంపించి నాదము పుట్టుతుంది. ఈ నాదము వీణమెట్ల లాంటి గుల్ల స్తంభాలకి అంది, వాటిలోని గాలి ఈ నాదానికి జల్లు మనడమువల్ల 'గుంయి' మని మోతపెడతాయి. తీగెలు బిగించని పిచ్చి స్తంభాలు మోత పెట్టవు.

స్తంభాలు లోపల గుల్లకాకపోతే నాదము మందంగా వుంటుంది కాని అసలే పోదు.




# ప్రపంచరాజ్యం

బొడ్డపాటి రాజా

ఈ సుందర విశ్వమ్మొక బొమ్మరిల్లు.
ప్రపంచ బాలలమంతా కూడీ
బొమ్మరింటిలో బువ్వాలాడీ
తప్పెటతాళాల పెళ్ళిళ్లు చేసీ
వీరులకథలను చెప్పుకొంటూ
చందమామ మా చెంతనుండగా
ప్రపంచక్షేమం మా క్షేమంబని
తీయటి కలలనుకంటాము,
ఎఱుపూ, నలుపూ రంగులభేదం
నీవూ నేనను భేదభావమూ
హిందూ, ముస్లిం, ఆంధ్రా, అరవం,
కమ్మా, కాపూ, హరిజన్, వైశ్యా,
తెలగా, వెలమా, రెడ్డీ, బ్రాహ్మణ
జాతుల సృష్టి మనుజులదేనని
మానవులందరు ఏకజాతియని
మంచీ చెడ్డా భేదంతప్ప
ప్రకృతిదృష్టిలో అందరు సమమని
దేశదేశముల చాటిద్దాం.
కులమత ద్వేషాల్ నాశంచేసే
ప్రపంచరాజ్యం స్థాపిద్దాం.

# అల్లుడుగారి ప్రతాపం

శ్రీ జి. వి. జి. కృష్ణ

నిజానికి భీమన్నది బలసిన శరీరమే ఐనా, అదేమిటోగానీ, తను బలశాలిఅని భీమన్న ఎవరితో ఎంత చెప్పినా వాళ్లు నమ్మేవారుకారు. అత్తామామగార్లు నమ్మకపోతే పోయారుగానీ, కొత్తగా పెళ్లాడిన భార్యచిట్టెమ్మయినా, నమ్ముతుందా అంటే అదిలేదు! నమ్మకపోగా భీమన్న బలశాలియని చెప్పినప్పుడల్లా చిట్టెమ్మ హేళనగా చూస్తూ ఓమోస్తరు ముసి ముసి నవ్వులు నవ్వుకొనేది.

భీమన్న ఎన్నాళ్లని సహించి ఊరుకోగలడూ? తను బలశాలి అన్న సంగతి ప్రత్యక్షంగా రుజువు చేసి చూపిస్తేనేగానీ, ఒక్కరూ నమ్మేటట్లులేరు. కానీ, ఎలా రుజువుచేయటం? ఎలా నమ్మించటం? రెండురోజులు నిద్రాహారాలుమాని బాగా ఆలోచించాడు. ఆలోచించగా ఆలోచించగా-చివరికి ఒక చక్కని ఆలోచన మెరిసింది. మనిషి, ఎగిరిగంతేసి, వెంటనే తన స్నేహితులకోసం పరుగుతీశాడు.

కొద్దిసేపట్లోనే స్నేహితులందర్నీ ఒకచోటచేర్చి "మీవల్ల నాకోచిన్న సాయంకావాలి. అది గనక చేసిపెడితే, మీకేమైనా సొమ్ము ముట్టచెప్పగలను" అని భీమన్న చెప్పేసరికల్లా —"ఏంటా సాయం?" అంటూ ఆతురతతో ప్రశ్నించాడొక మిత్రుడు.

"ఏంటంటే - ఈవేళ రాత్రి, దాదాపు పదకొండు, పన్నెండు గంటలప్పుడు, మీరందరూ దొంగల్లాగా వేషాలేసుకొని మా మామగారి ఇంట్లోకి జొరపడాలి...మా మామగారి యింట్లోకి... తెలిసిందా?—జొరపడి, ఇంట్లోని పాత్రలూ, గిన్నెలూ, చిన్నచిన్న సామానులూ దొర్లించి ఊరుకోండి. ఈ చప్పుళ్లకు వాళ్లు మేలుకొని 'దొంగలు...దొంగలని' కేకలేస్తారుగా? అప్పుడు నేను లేచివచ్చి మిమ్మల్ని బెదిరిస్తున్నట్లు బెదిరిస్తాను. నోటికొచ్చినట్లల్లా తిట్తాను. మీరు నన్ను చూడంగానే హడలిపోయినట్లుగా నటించాలి. అంతేకాదు.-నేను మీతో కలియపడి పోట్లాటల్లోకికూడా దిగుతాను. నేను ఒక్కొక్క దెబ్బకొట్టగానే 'హా.. చచ్చాంబాబూ' అంటూ మీరందరూ ఒక్కొక్క రొక్కొక్కరిగా నేలమీద పడిపోవాలి... తెలిసిందా! ఈమాత్రం సాయం గనక చేసిపెడితిరో, మీరడిగినంత డబ్బిస్తాను" అని ఓచిన్నవిన్నపం చేశాడు మన భీమన్న.

డబ్బు ఆశకు లొంగిపోయిన వారవటంచేత, భీమన్న తమను



ఎందుకు యిలా చేయమంటున్నాడో అని అయినా యోచించక "ఓస్-ఇంతేనా... దానికేంలేగానీ-ముందు మా చేతుల్లో కాసిని డబ్బులు గలగల్లాడనీ!" అని ఒకరిద్దరన్నారు.

నిజానికి భీమన్నది మట్టిబుర్ర అయినా-ఒక్కోసారి ఇలాటి సమయాల్లో బలే చురుకుగా పనిచేస్తూంటుంది. వాళ్ళకు ఏదో ఒకటి ముట్టచెప్పి ఉత్సాహం కల్గించకపోతే, తనపని సవ్యంగా నెరవేరదని దూరం ఆలోచించి తలా ఒక్కొక్క రూపాయ చొప్పున వాళ్లందరికీ ఎనిమిది రూపాయలు పంచిపెట్టి "అన్నట్లు మీరు మా మామగారింటికి కన్నం గిన్నం తవ్వాల్సిన అవసరంలేదు. ముందుగానే నేను పెరటి తలుపులు అన్నీ తెరిచి సిద్ధంగా ఉంచుతాను. సరిగ్గా రాత్రి రాణాలో పన్నెండు గంటలు కొట్టేసరికల్లా మీరందరూ మా మామగారి ఇంట్లోకి చొరబడాలి. ఇంకో సంగతి-మనం పోట్లాడుకొనేటప్పుడు ఒకరి కొకరు బలంగా కొట్టుకోకూడదు... మెల్లి మెల్లిగా కొట్టుకోవాలి... అంతే... సరేనా?" అన్నాడు భీమన్న.

"అదికూడా నువ్వ చెప్పివ్వాలటోయ్... మాకంతా తెలుసులే... ఆఁ... ఇక మేం వెళ్లొస్తాం" అని భీమన్నవద్ద సెలవు పుచ్చుకొని ఒక్కొరొక్కొరుగా జారుకున్నారు.

రాత్రి తొమ్మిది గంటలయ్యేసరికల్లా, భీమన్న కడుపు నిండా సుష్టుగా భోంచేసి గదిలో పడుకున్నాడు. పది గంటలయ్యాక— ఇంట్లో అందరూ గాఢంగా నిద్రపోతూండటం చూసి, మెల్లిగా అడుగులో అడుగులు వేస్కుంటూ వెళ్లి, పెరటి తలుపులు తీసొచ్చి యథాప్రకారంగా తన మంచం మీద పడుకున్నాడు. నిమిషాలు గడిచే కొద్దీ-ఎప్పుడెప్పుడు పన్నెండవుతుందా ... ఎప్పుడెప్పుడు తన బలశాలిత్వాన్ని అందరికీ తెలియపరుద్దామా అన్న ఆతురతతో ఉక్కిరి బిక్కిరై పోతున్నాడు భీమన్న!

రాణాలో పదకొండు గంటలు కొట్టారు. భీమన్న సెకెండ్లూ నిమిషాలూ లెఖ్ఖ పెట్టుతున్నాడు. దాదాపు ఒక అర్ధగంట అయ్యేసరికి ఉన్నట్లుండి వంటింట్లో ఏవో ప్రాతలూ గిన్నెలూ దొర్లించిన శబ్దాలయ్యాయ్. ఇదేమిట్రా! వెధవల్ని పన్నెండు గంటలు కొట్టాక రమ్మంటే – అప్పుడే వచ్చేశారే అని తన మిత్రుల్ని లోలోన తిట్టుకుంటూనే, ఆ శబ్దాలకు అందరూ ఎప్పుడెప్పుడు మేల్కొంటారా, ఎప్పుడెప్పుడు తన బలశాలిత్వాన్ని ప్రదర్శిద్దామా అని తొందరపడుతూ వున్నాడు. భీమన్న అదృష్టం కలిసి వచ్చింది. కొద్ది సేపట్లోనే భీమన్న మామగారు చటుక్కున మేల్కొని "దొంగల్రోయ్!... దొంగలు!! దొంగలు పడ్డార్రోయ్" అని ఒకే గుక్కలో కేక పెట్టడం మొదలెట్టాడు. చివరి ముక్క అనే లోగా మాత్రం, మామగారి నోరును ఎవరో అమాంతంగా నొక్కి పట్టినట్లు భీమన్నకు తోచింది.

ఆ కేకలకు ప్రక్కన పడుకొని వున్న చిట్టెమ్మకూడా మేల్కొని "అయ్యో! వినపడటం లేదుటండీ? దొంగలటండీ! ఊఁ... లేచి వెళ్లండీ; ... మేల్కొనేనా కాలు కదపకుండా వున్నారూ!" అంటూ దెప్పటం మొదలెట్టింది.

భీమన్న మంచం మీదనించి లేస్తూ "ఇదో - వెళ్తున్నా మీ యింట్లో దొంగలు పడితే నేనేగతి అని తెలిస్తే చాలు." అంటూ మీసాలు ఓమారు మెలివేసుకుని, మూలనున్న దుడ్డు కర్రను చేతబట్టి, మెల్లిగా హాలులోకి వెళ్లాడు.

అంతా గాఢాంధకారంగా వుంది. కన్ను పొడుచుకున్నా కంటికి ఏదీ కనబడేటట్లు లేదు. మెల్లిగా తడుముకొంటూ తడుముకొంటూ ఎలాగో వెళ్లుతున్నాడు మన భీమన్న. ఎక్కడికి పోతున్నాడో ఏమిటో అతనికే తెలికుండా ఉంది. ఉన్నట్లుండి అతని చేతిలోని కర్రను లాక్కొని, అవతల పారేశారెవరో.

భీమన్నకు కోపం ఆగింది కాదు. "ఎవర్రా – అదీ?" అని గాండ్రిస్తూ, ఎదురుగా నున్న ఒక నల్లటి ముసుగు మనిషితో కలియబడ్డాడు-ఆ ముసుగు మనిషి భీమన్న నడ్డి విరిగేటట్టు బలంగా ఒక దెబ్బ చరిచాడు. ఆ దెబ్బకు భీమన్న తల తిరిగి నోట్లో కొచ్చింది. "ఒరేయ్! మెల్లిగా కొట్టుకోవాలని చెప్పలేదట్రా!" అని ఆ ముసుగు మనిషి చెవిలో మెల్లిగా గొణగబోయాడు.

"మెల్లిగా కొట్టాలిట అయ్యను ... మెల్లిగా కొట్టకేం!" అంటూ మరింత బలమైన దెబ్బ ఒకటి తగిలించాడా ముసుగు మనిషి. "ఉష్... గట్టిగా కేకెట్టకురా బాబూ" అని భీమన్న ఎంత మూల్గినా వాడు విని

(52-వ పేజీ చూడుడు)



పంచతంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



అనగనగా ఒక దేశాధీశుని
హంసతూలికల పానుపుపై



నల్లి ఒకటి తన కొడుకులతో
మనమలతో మునిమనమలలో
కాపురమున్నది కలకాలం



రోజుకి రోజూ రాజు రక్తమును
పీల్చి పీల్చి తెగబలిసినవి



ఒక రోజున
ఆ పానుపుపైనా
వచ్చి పడిందొక
మిణ్ణల్లి



మెత్తని పక్క ఘుమ్మను వాసన
అంతా చూస్తు ఆ మిణ్ణల్లి
ఒళ్ళూ గళ్ళూ మరచింది
అక్కడనే తను ఎల్లకాలమూ
నివసించాలని అనుకుంది



"ఎవరోయ్ నువ్వూ?
ఏ వూరి మందీ?
రాజులు పరుండు
పరుపులపైనా
ఏం పని నీకూ?
ఫోపో ఛీపో"



"అమ్మా నల్లీ, కావుము తల్లీ!
అందరి నెత్తురు రుచి చూశా మరి
రాజుల రక్తం రుచి చూడాలని
గంపెడాసతో వచ్చాను"



"అయితే మాతో పాటే వుండుము
రాజుగారు తెగ తాగిన వేళల
మాత్రమె రక్తం పీల్చు సుమా!"



రాజుగారు తమ తల్పంపైనా పడు
కొనగానే ఆ మిణ్ణల్లి- తిండికి తహ
తహలాడింది - మెల్లమెల్లగా రాజును
చేరి-వీపు కసిక్కున కొరికింది'



'చచ్చాన్రో' అని రాజులేచి తన భటులందరినీ
తిట్టాడు - భయపడి నల్లిపిల్లలందరూ
మూలకు పోయీ నక్కాయి



రాజ సేవకులు దీపాల్ తెచ్చీ- అన్ని
మూలలూ అన్వేషించీ- అసలు దోషి
మిణ్ణల్లినేకాకా- పాపం నల్లిని,
నల్లిపిల్లలను నేలకు
రాచి చంపారు!



"అందుకె రాజా! పరాయి వారికి- ఆశ్రయ
మిచ్చుట అనర్థకం - పాతమిత్రులను
వదిలిపెట్టి పెడ- దారులు తొక్కిన నక్కను
పట్టిన అవస్థ తమ రెరిగినదేగా!"




అనగనగా ఒక పట్నంపక్కన
అగణ్య మందొక జంబుక
ముండెను





పంచతంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి









































# డాన్ క్విక్‌సెట్

## పూర్వకథ

లామంచా అనే గ్రామానికిచెందిన డాన్ క్విక్ సెట్ అనే వెర్రి వెంగళప్ప ఒకగు తనుకూడా ఒకవీరుడు (నైట్) గా పేరుపొందాలని వుబలాటపడి, 'రోజినాన్టి' అనే ఒక కుంటిగుర్రాన్ని ఎక్కి బయలుదేరాడు. ఒకానొక స్త్రీమూర్తిని ఎంచుకొని ఆమెకుతానే 'డల్ సీనియా' అనేపేరు పెట్టుకొన్నాడు. ఆమెమన్నన సంపాదించటం కోసమే తాను ధర్మరక్షణమనే కఠోరదీక్ష స్వీకరించానని నమ్మాడు.

ఏవేవో వెర్రివర్రి ఆశలుచూపి శాంకోపాంజా అనే ఒక అమాయకపు కూలీని తన బంటుగా చేసుకొన్నాడు వాడు 'డాపుల్' అనే ఒక గాడిదనెక్కి యీయన వెనకాలే బయలుదేరాడు. ఒకటి రెండు చోట్ల డాన్ క్విక్ సెట్ ఏవేవో సాహసకార్యాల చేయబోయాడు. ప్రతిసారి చావుదెబ్బలు తిన్నాడు.

ఒకరోజున వీళ్లిద్దరూ ఒక మైదానుగుండా పోతుండగా, డజనుమంది ఖైదీలను గొలుసులతో కట్టేసి నలుగురు పోలీసులు నడిపించుకు వస్తూ, వీళ్లకు ఎదురైనారు. డాన్ క్విక్ సెట్ అనవసరంగా ఆ ఖైదీలమీద జాలిపడి, పోలీసులమీదకు యుద్ధానికి వెళ్ళాడు. పోలీసులు నలుగురేకావడంచేత పారిపోయారు. వీళ్లందరినీ తను విడిపించినందుకుగాను, యింతమందిఖైదీలనీ తక్షణమే 'టొబోసో' గ్రామానికి పోయి డల్ సీనియా రాకుమారిగారికి తన ప్రతాపం ఎరుకపరచమని హుకుంచేశాడు. వాళ్లు మేం యిప్పుడుపోము పొమ్మన్నారు. మాటా మాటా పెరిగింది. ఆఖైదీలందరూ కలిసి యీ వీరుణ్ణి రాళ్లతోకొట్టి ఎవరిదారిని వాళ్లు చక్కాపోయారు. అంతటితో డాన్ క్విక్ సెట్ గారి ప్రథమ జైత్రయాత్ర ముగిసింది. ఇద్దరూస్వగ్రామం చేరుకొన్నారు.

## 10

ఒళ్లంతా గాయాలుచేసుకొని యింటిపట్టుకు చేరిన డాన్ క్విక్ సెట్ గారు, మంచంలోనుంచి లేవలేనన్నిరోజులూ బుద్ధిగానేవున్నారు. ఆ గాయాలూ అవీ కొంచెం నయమై, వంట్లో కాస్తంత ఓపిక వచ్చిందనేసరికి, యీయనగారి బుర్రలో మళ్లీపురుగు తొలవటం మొదలైంది.

ఒకరోజు చీకటిపడ్డాక, వూరికే అలా షికారుగా వెళ్లివస్తానని యింట్లోవున్న మేనకోడలితో చెప్పి, ఆమెను ఒప్పించి, రోడ్డువెంట బయలుదేరాడు. రోడ్డు ఎక్కీ ఎక్కటంతోటే, శాంకో పాంజాగాడు కాపురముండే గడిసె వైపుకు దారితీశాడు.

అన్నిరోజులపాటు అలా విడవకుండా ఆయనను అంటిపెట్టుకు తిరిగిన జీవమేమో, వీడికికూడా యీయనను ఎప్పుడెప్పుడు చూద్దామా అని గుబులుగుబులుగానే వుంటున్నది. ఇంతలో ఆయనగారే కాళ్ళీడ్చుకొంటూ తనకొంపకువస్తే, వాడికి కొండెక్కినంత సంతోషంవేసింది. ఇద్దరూ ఒకళ్లనొకళ్లు గట్టిగా కౌగలించుకొన్నంత పనిచేశారు.

ఇద్దరికీ చెరి చేరెడు ఆనందభాష్పాలు రాలిపోయాకగానీ, యిద్దరి మనస్సులూ కొంచెమైనా తేలికపడలేదు. ఇద్దరూ అక్కడే కూలబడి వెనుకటి తమ వీరవిహారాల తాలూకు అనుభవాలను తెగ నెమరవేసుకోవటం మొదలుపెట్టారు. ఆ మాటలధోరణిలోనే శాంకోపాంజా కొత్త విశేషమొకటి బయటపెట్టాడు.

వీళ్ల యీ 'లామంచా' గ్రామంలోనే, బస్తీకెళ్ళి కాలేజీచదువు చదివిన కుర్రాడొకడువున్నాడు. ఆ కుర్రాడు యీ మధ్యనే శెలవులకు యింటికి వచ్చాడు. అతనిపేరు 'శాంసన్ కార్రాస్కో.' ఈ శాంసన్, డాన్ క్విక్ సెట్ గారి వీర విహారాలను గూర్చిన వుదంతాలన్నీ పత్రికల్లోనూ, పుస్తకాలలోనూ చదివాడట! ఆయనే స్వయంగా యీ విషయం తనతో చెప్పాడని శాంకో పాంజా, డాన్ క్విక్ సెట్ గారికి ఎంతో మురిపెంతో తెలియచెప్పాడు.

భలే!—డాన్ క్విక్ సెట్ గారు, యీనాటికి వీరుడుగా తయారవటమేకాక, యీయన పేరూ అదీ అచ్చుకూడా అవుతూవున్నాయన్నమాట! ఇంకేం—డాన్ క్విక్ సెట్ గారిని పట్టపగ్గాలేలేకుండాపోయాయి. ఆయనగారి మనస్సుకు రెక్కలు వచ్చేశాయి. తన వొంట్లో యిక ఆ కాస్త ఓపికకూడావస్తే, తాను ఏ ఏ ఘనకార్యాలు చేయబోయేదీ, ఎటువంటి ఘనతర విజ

అనువాదం: శ్రీ విశ్వాత్ముల నరసింహమూర్తి

యాలు సాధించబోయేదీ, అవన్నీ తియ్యతియ్యగా ఆలోచించుకోవటం మొదలుపెట్టారు. ఆ ఆలోచనల సందడిలోనే, శాంకోపాంజాను వెంటనే పోయి ఆ కుర్రాణ్ణి తనవద్దకు తీసుకురమ్మన్నాడు. (తనవొంట్లో ఓపిక లేకుండాపోయింది కానీ, లేకపోతే తానే పరిగెత్తేవాడుకదూ!) శాంకోపాంజాకూడా సంబరాలు పడుతున్నాడేమో, యీయన ఈ మాట అనటమే తరువాయిగా, కూర్చున్నవాడల్లా గప్పున లేచి, మట్టి దులిపేసుకు, నడ్డి ఆడించుకొంటూ అటువేపు పరిగెత్తుకుపోయి, కన్నుమూసి కన్ను తెరిచేలోగా ఆ కుర్రాణ్ణి వెంటబెట్టుకువచ్చాడు.

వాళ్లింకా అంతదూరంలో వున్నారనగానే డాన్ క్విక్ సెట్ గారు లేచి ఎదురువెళ్లి, ఆ కుర్రాడి కుడిచేయి తన రెండుచేతులతోనూ గట్టిగా నొక్కిపట్టుకొని తెగ 'షేక్‌హాండ్' యిచ్చాడు. ముగ్గురూ కలిసివచ్చి, మామూలుచోట కూర్చొని కుశల ప్రశ్నలన్నీ అడిగి తెలుసుకోవటం అయ్యాక, డాన్ క్విక్ సెట్ తానే ఆకుర్రాణ్ణి అడిగాడు — "నవయువకా! నేనలిపిన వీర విహారములను గూర్చి ఏవో పుస్తకములందు వర్ణించబడి యుండగా, వానిని నీవు చదివి యున్నట్లు నాబంటు, — యీ శాంకో పాంజా — నాకింతకు ముందే నివేదించియున్నాడు. ఇది నిజమేనా?" అని.

శాంసన్ కూడా ఎంతో నమ్రభావాన్ని ప్రకటిస్తూ ఆమాట యథార్థమేనని చెప్పాడు. ఈయన అంటే తనకెంతో గౌరవమూ, భక్తీ వున్నట్లు కనపరిచాడు. తాను చదివిన ఆపుస్తకాలలో యీయనగారి ప్రతాపాన్ని గూర్చి ఎలా ఎలా వర్ణించబడి వున్నదీ, అదంతా కంఠస్థంచేసిన వాడిలా, పేజీలకు పేజీలు అప్పచెప్పేశాడు. ఆ శాంసన్ అలా ఒక్కొక్క వాక్యమే అప్పచెప్పుతూ వుంటే, డాన్ క్విక్ సెట్ గారి మొఖం అంతకంతకు విప్పారుకు పోతున్నది. ఒళ్లు పరవశమై తనవీపు తానే చరుచుకోవటం మొదలు పెట్టాడు. ఈతంతు అంతా పక్కా అరగంటసేపు నిరాఘాటంగా కొనసాగిపోయింది. ఇక అప్పటినుంచి డాన్ క్విక్ సెట్ గారికి ఆ కుర్రాడంటే ఎక్కడలేని అభిమానం పుట్టుకొచ్చింది. అప్పటినుంచీ డాన్ క్విక్ సెట్ గారు రోజులో వీలైనన్ని గంటలు యీ కుర్రాడితోనే గడిపేసేవాడు.

అంతేకాదు—యీ కుర్రాడు యిచ్చిన ఆసరాతోనే యీ భీకరానన వీర శూరాగ్రేసరుడు డాన్ క్విక్ సెట్ గారు తమ ద్వితీయ జైత్రయాత్రకు సన్నద్ధులు కాగలిగారు. ఆకుర్రాడు యీయన పట్లతనకు వున్న ప్రేమ కొద్దీ, ఎక్కడిదో పాత వుక్కుటోపీ ఒకటి తెచ్చి యీయనకు బహూకరించాడు. అంతకు ముందునుంచీ డాన్ క్విక్ సెట్ గారి మూర్ధాన్ని అలంకరించివున్న ఆవుక్కుటోపీ కంటే, యిప్పుడు యీ శాంసన్ తెచ్చిపెట్టిన తుప్పుటోపీ కొన్ని విషయాలలో చాలా మెరుగనిపించింది. ఇదివరకటి టోపీ యీయనగారి తలకి పెద్దదైందని చెప్పానుగా! ఆకారణం చేతనేకదూ-ఆయన ఆటోపీ పడిపోకుండా తలచుట్టూ సీనా రేకు ముక్కలు, రిబ్బన్లూ, అట్టముక్కలు అంటించుకొనేవాడు! ఈటోపీ అయితే ఆ గొడవ అంతా తప్పుతుంది. అంతే కాకుండా యిదివరకటి టోపీలో సగంభాగం ఐపూ పత్తా లేకుండా పోయిందాయె. ఈటోపీ మాత్రం, మిగిలిన విషయాల్లో ఎల్లావున్నా, ఏ భాగమూ వూడిపోకుండా అంతా వున్నది. ఈయనగారి తలకు చక్కగా కుదిరిపోయింది కూడాను! ఇక యీయనగారి ఆనందానికి అంతులేకపోయింది. శాంసన్ ఆటోపీ తెచ్చీ తేవటంతోటే, అతని చేతిలోంచి దాన్ని యీయన తన్నుకుపోయి, తలకు తగిలించుకు, తెగ గంతులేశాడు. ఆతరువాత తీరుబడిగా కూర్చొని దానిమీద ఐదారు అంగుళాల ఎత్తున పేరుకొనివున్న దుమ్మూ, దూగర దులిపాడు. ఇసుక, యిటికరాతి పొడుముపేసి బాగా అరగంట సేపు దాన్నంతా తోమి, దానికి పట్టివున్న తుప్పునంతా వదిలించాడు. ఎంతకీ దానికి మెరుపు రాలేదు. నిగనిగలాడుతూ అయినా కనుపిస్తే కంటికి యింపుగా వుంటుందని దానినిండా యింత మంచినూనె పట్టించాడు.

ఈయనగారు వూపిరి సలపకుండా యిలా ప్రయాణ సన్నాహాలు చేస్తూ, తెగ గింజుకొంటూ వుంటే, ఆమేనకోడలూ, ఆ దాసీ యిద్దరూ, యీయనగారికి యీ దుర్బుద్ధి మళ్ళీ పుట్టుకొచ్చినందుకు, కన్నీరు మున్నీరుగా ఏడ్చారు. వాళ్లెంత ఏడ్చి, చచ్చి

గిపెట్టినా యీయన అవేమీ లెక్క చేయలేదు. వీధి గుమ్మంలో చేరి ఆ ఆడవాళ్లు యిద్దరూ ఆవరసను శోకాలు పెట్టుతున్నా అవన్నీ వినిపించుకోకుండా, డాలూ, డవాలూ తగిలించుకొని, తన ముద్దుల గుర్రం 'రోజినాన్‌టీ' మూపున ఎక్కినవాడై నమ్మిన బంటు శాంకో పాంజా గార్ధభారూఢుడై, "న్న వెన్నంటి రాగా, అధర్మాన్ని అన్వేషించుకొంటూ విశాల ప్రపంచలోకి పయనించాడు. వీరిద్దరి వెంటా ఆ శాంసన్ కూడా వూరి వెలుపల దాకా వెళ్లి, వాళ్లను పంపించి వచ్చాడు.

మొన్న యింటికి తిరిగి వచ్చేరోజున తానున్న పరిస్థితికీ, యీ నాడుమళ్లీ జైత్ర యాత్రలకు బయలు దేరే సమయాన తానున్న పరిస్థితికీ ఎంత వత్యాసం వున్నదీ డాన్ క్విక్‌సెట్ గారు మనసులో ఒక్కసారి సరిపోల్చు కొన్నారు. ఆ సంతోషంలో ఆయనకు బంగారం లాంటి ఒక ఆలోచన తట్టింది. ఇక ఒక్క క్షణమైనా ఆలస్యం చేయకుండా, ఎకా ఎకిని ఆ 'టొబోసో' పట్టణానికిపోయి 'డల్ సీనియా' రాకుమారిని, అన్వేషించి, ఆమెగారి దివ్యసమక్షమందు, తాను సల్పిన వీర విహారోదంతాలను వివరించి చెప్పాలను కొన్నాడు. ఈ విషయాన్ని శాంకో పాంజాకు తెలియ చేసి, 'టొబోసో' కే దారితీయమని పురమాయించాడు. ఇద్దరూ ఆవైపే వాహనాలను పట్టించి ప్రయాణం కొనసాగించారు.

(ఇంకావుంది.)




(గతసంచిక తరువాయి)

ఆటలు ఆడే బొమ్మలు, పాటలు పాడే బొమ్మలను గురించి గడియారం చెప్పుతు వస్తుంటే, సుందరం బలే సరదాగా ఆకథలన్నీ విన్నాడు. అన్నీ విన్నాక అతడి కొక అనుమానం తగిలింది.

"అయితే యీ బొమ్మలు అన్నీ ఎవరెవరో తయారు చేశారని చెప్పావు కదా; వాళ్లను గురించి నీకెలా తెలిసిందీ" అని అడిగాడు.

"అదేమిటోయ్! ఆ బొమ్మలు చేసిన వాళ్లంతా మొట్టమొదట్లో గడియారాలు బాగుచేసినవాళ్లేగా! వాళ్లను గురించి నాకు తెలియక పోవట మేమిటి!" అని చెప్పి గడియారం ఆతనికి వచ్చిన సందేహాన్ని నివృత్తి చేసింది.

"అది సరే కానీ, సుందరం! యీవాళ్ళ తారీకు ఎంత?" అటువైపు గోడకు తగిలించివున్న కాలెండరు చూస్తూ, గడియారం అడిగింది. ఆ కాలెండర్‌లో ఏరోజు కారోజు పై కాగితాన్ని చించి పారెయ్యాలి.

"ఏం? సెప్టెంబరు 13."

"అయితే యీ కాలెండరులో యింకా 11 వతేదీయే వున్నదేం? మీరంతా రెండు రోజులు వెనకపడి వున్నారన్న మాట."

"ఈ కాలెండరుతో వచ్చిన తిప్పలే అది. ప్రతిరోజూ ఆ కాగితాలను చించే పని మా అక్కయ్యది. ఆవిడగారు ఒక్కొక్కసారి వారాల తరబడి ఆకాగితాలు చించటం మరచిపోతుంది. ఒక్కొక్కప్పుడు మూడు నాలుగేసి కాగితాలు ఒక్కసారే చించి అవతల పారేస్తుంటుంది. ఉత్త ఖయ్యాళి మనిషి" తనకు అక్కగారిమీద వున్న అక్కసు అంతా యీ రూపేణా వెళ్లగ్రక్కాడు; సుందరం.

"అందుకనేనోయ్ సుందరం; ప్రతిరోజూ రాత్రి 12 గంటలయ్యే సరికల్లా, చెట్టునుంచీ ఆకు వూడిపోయిన చందాన, రోజు కొక్క తారీఖు కాగితం వూడిపోయే కాలెండరు ఎవరైనా కనిపెట్టుతే బాగుండునోయ్."

"ఆపని నేను చేస్తానులే; పెద్ద అయ్యాక!... చెయ్యలేనంటావా?"

"ఎందుకు చెయ్యలేవోయ్. పట్టుదలగా కృషి చేయాలి కానీ, అదేమంత గొప్ప విషయం కనుకా! ...అది కాదు కానీ, స్ట్రాస్‌బర్గ్‌లో ఒక 'పెద్ద' గడియారం ఒకటి వుండోయ్. దాంట్లో టైం ఎంతైందీ చెప్పేదుకే కాక, ఆ సంవత్సరంలో అది ఏవారమైందీ, ఏ తారీకు అయిందీకూడా చెప్పేందుకు ఏర్పాట్లు వున్నాయి. ప్రతిఏడాదీ డిశెంబరు 31 వ తారీకున, రాత్రి 12 గంటలప్పుడు వారాలు తారీకులువున్న వలయం దానంతటఅదే, పైఏడాది పొడుగునా నడువవలసిన వారాల క్రమానికి అనుకూలంగా మారిపోతుంటుంది. ఇంత కంటేకూడా మంచి విశేషం ఒకటి ఆ గడియారంలోవున్నది. ప్రతిగంటలోనూ మొదటి పావుగంట గడిచేసరికి చిన్న కుర్రాడి బొమ్మ ఒకటి అక్కడవున్న మెట్లమీదకువచ్చి తొంగిచూసిపోతుంది. అరగంట గడిచేసరికి 25 ఏళ్ళ కుర్రాడి బొమ్మ ఒకటి యివతలకు వస్తుంది.

ముప్పావుగంట గడిచే సరికి నడి వయస్సుదాటిన పెద్దమనిషి బొమ్మ ఒకటి యివతలకు వస్తుంది. పెద్ద ముల్లు సరిగ్గా 12 అంకెమీదకు పోయేసరికి పండు ముసలివాడి బొమ్మ ఒకటివస్తుంది. ఆ ముసలాడి బుజాలమీద మృత్యువు కొడవలిపట్టుకొని కూర్చొని వుంటాడు."

"ఏమిటి; యీ బొమ్మలకు అర్థంఏమిటి?"

"అర్థం ఏమిటంటే—ఒకగంట అనేది ఒకమనిషి జీవిత ప్రమాణం అయితే, అరగంట గడిచేసరికి యౌవనదశలో వుంటాడనీ, ముప్పాతికగంట గడిచేసరికి తల నెరిసి పోతుందనీ, గంటా పూర్తి అయ్యేసరికి మృత్యువు అలా ఆ కొడవలితో గొంతుకోసి పారేస్తుందనీ అర్థం. తెలిసిందా?"

"ఊఁ! తెలిసింది."

"ఎన్ని చెప్పినా, ఏమిచేసినా ఏ ఒక్క గడియారమూ సరిగ్గా టైం ఎంతైందీ చెప్పలేదులే" అని గడియారం దిగులుగా నిట్టూర్పు విడిచింది.

"అదేమిటి! నువ్వే ఆమాట అంటున్నావేం?"

"ఆమాట నిజమైనప్పుడు అనటానికి సందేహమెందుకోయ్! ఎంతమంచి గడియారమైనా కానీ, వాతావరణంలో వచ్చే మార్పుల వల్లా, దానిలోపల చేరేదుమ్మూ, దుగరా మూలంగా కుంటు పడక తప్పదనుకో. అందుకే ప్రతి గడియారానికీ తరుచు జబ్బులు చేస్తూ వుంటాయి. ఏ గడియారమైనా కాస్త కాస్త బద్ధకించినట్లు కనిపించిందో, మీ మనుష్యులు వెంటనే దాన్ని హాస్పిటల్‌కు చేరవేస్తారు"

"హాస్పిటల్‌కు ఎందుకూ?"

"హాస్పిటల్ అంటే మీరంతా జబ్బులు చేసినప్పుడు వెళ్లే హాస్పిటల్ కాదు: గడియారాలు రిపేరు చేసే కొట్లే మాపాలిటి ఆస్పత్రులు. వాళ్ల చేతికి గడియారం చిక్కిందీ అంటే, నిర్దాక్షిణ్యంగా మెడ పట్టుకు గిరగిరా తిప్పేస్తారు. ఆ తరువాత శ్రావణంతో, మా పొట్టలు పగలగొట్టి, భూతద్దం తగిలించిన ఒంటి కంటితో పరీక్ష చేసి, అక్కడో పోటు, యిక్కడో పోటుగా పదిమాట్లు మా కడుపంతా చిల్లులు పడేట్లు గుచ్చుతారు. ఇక అక్కడ నుంచీ, మా వొంట్లో ఏ భాగాని కాభాగం విడదీసి బల్లమీద పేరుస్తారు. ఆకురాయి పుచ్చుకొని కొన్ని కీళ్లు అరగతీస్తారు. సుత్తి దెబ్బలు కొట్టి మరొక చక్రాన్ని సాగదీస్తారు. ఇలా వాళ్ల విద్యనంతా మామీద ప్రయోగించి, మా మొఖాన యింత ఆముదంపోసి, మళ్ళీ ఎక్కడికీళ్లు అక్కడ మేకులతో బిగించి పారేస్తారు. ఒకొక్కసారి యీ హాస్పిటల్‌కు పోయి వచ్చామంటే మా ఆయుర్దాయంలో



పొరుగింటి పుల్లకూర రుచి.

కనీసం ఐదు సంవత్సరాలైనా అరిగిపోతాయంటే నమ్ము!"

"అవున్లే పాపం!"

"ఇన్ని రకాల యిబ్బందులు వున్నాయి కనుకనే, గడియారాలు ఎల్లప్పుడూ ఒకేలా పనిచేయలేవు. ఎప్పటికైనా ఆకాశంలో క్రమం తప్పకుండా తిరిగే ఆ సూర్యుడూ, ఆ చంద్రుడు, ఆ నక్షత్రాలే నమ్మదగినవనుకో. మానవుడు తయారు చేసిన ఆ 'మనియారాలు' ఎంత నమ్మదగినవో, యీ గడియారాలు అంతే నమ్మదగినవి" అంటూ వుండగానే గడియారం కడుపులో కొండశిల కదిలింది. పేగుల్లో దేవటం ఆరంభమైంది. టిక్కు టిక్కు ఆగిపోయినట్లయింది. గడియారం ఆచిఆచి పదకొండు గంటలు కొట్టింది. కడుపులో గొడవ అంతా కాస్తసర్దుకొన్నాక, గడియారం తెముల్చుకొని "ఏమోయ్! సుందరం నేనంటే నీకు యిప్పుడు యిష్టమేనా!"

"ఓ"

"అయితే నేనొక్క మాట చెప్పతాను. కోపంరాదు కదా!"

"కోపం ఎందుకూ? చెప్పూ!"

"ఆఁ! ఏమీలేదు. వేళకు నిద్ర లేవటం, వేళాకు బడికి పోవటం, వేళకు యింటికి రావటం, వేళకు చదువుకొని, వేళకు పడుకోవటం రేపటినుంచీ అలవాటు చేసుకోవోయ్. దానివల్ల యిప్పుడే నీకంత ప్రయోజనం వున్నట్లు కనుపించకపోయినా, ముందు ముందు పెద్ద అయ్యాక, యీ నియమంవుండటమనేది అనేక విషయాల్లో అనేక విధాల ఉపయోగ పడుతుందోయ్,"

"చూద్దాంలే."

"చూద్దాంలే అంటే కాదు! ఇప్పుడే నిశ్చయం చేసేసుకోవాలి. మీ యింటిని యిన్ని తరాలుగా కనిపెట్టుకొని వున్న యింత పెద్ద దాన్ని, నాకోసమైనా యీ అలవాటు చేసుకోవోయ్; సుందరం"

ఇంతసేపూ యిన్ని రకాల కథలు చెప్పిన యీ గడియారం యిప్పుడు తనను యింతగా బ్రతిమలాడు తున్నందుకు సుందరానికి జాలివేసింది.

"సరేలే. రేపు ప్రొద్దుటినుంచీ నువ్వు చెప్పినట్లే చేస్తాను."

"అమ్మయ్య!... మా సుందరం అంత మంచి పిల్లవాడు యీ మూడు లోకాల్లో మరెక్కడా లేడు." అంది గడియారం తృప్తిగా నవ్వుతూ.

ఇంతసేపూ వీధి అరుగుమీద కూర్చొని ప్రక్కయింటి పంతులు గారితో రాజకీయాలు మాట్లాడిన సుందరంనాన్నగారికి, యిప్పటికి కాని ఆకలిమాట జ్ఞాపకం రాలేదు. పంతులుగారిని పంపేసి, యింట్లోకి వచ్చి చూశాడు. తల్లిలేని పిల్ల, నాన్నగారికి అన్నం వడ్డించటం కోసం వంటయింట్లో ఎప్పటినుంచీ కనిపెట్టుకు వున్నదో ఏమో, అక్కడే పీటలు పరుచుకు నిద్ర పోతున్నది. సుందరంనాన్నగారి మనస్సు చివుక్కు మన్నది. పాపం పిల్లలు ఎంత ఆకలి గొన్నారోనని ఆ తండ్రి ప్రాణం అలమటించి పోయింది. కాళ్లు కడుక్కొని వచ్చి, అమ్మాయిని నిద్దుర లేపి, "తమ్ముడేడమ్మా" అని అడిగారు.

"ఏమో నాన్నా! నేనూ చూడలేదు" అంటూ గాబరాగా, చేతిలో లాంతరు పెట్టుకొని ఇల్లంతా వెతికింది. వెతకగా, వెతకగా పరుపు చుట్టలనందున సుందరం నిద్రపోతూ కనిపించాడు.

"ఒరేయ్! తమ్ముమ్మ! తమ్ముమ్మ! లేనాయనా; అన్నం తిందువు గాని. సాయంకాలంకూడా ఏమీ తినలేదు చిట్టి వెధవ్వ!" అంటూ వీపు తట్టి నిద్రలేపింది.

సుందరం కళ్లు నలుపు కొంటూ లేచి కూర్చున్నాడు. ఇందాకటినుంచీ అన్నీ కథలు చెప్పిన ఆ గడియారం, ఏమీ ఎరగనట్లు టిక్కు టిక్కు మంటూనే వుండిపోయింది.

ఆరోజు తరువాత, సుందరం ఏనాడైనా వేళతప్పి ఏపని చేసినా గడియారంకేసి చూస్తూ దిగులుగా వుండిపోయే వాడు. (ఐపోయింది!)

## రంగు రంగుల స్టంటు చిత్రం

# ★ "ఆన్" ★

మహబూబ్ ప్రొడక్షన్సువారి "ఆన్" నిస్సందేహంగా కొత్త రకం చిత్రం. ఈమాటను లండన్ పత్రికలు అంగీకరించాయి; మనమూ అంగీకరిస్తున్నాము. లండన్‌పౌరులు భారతీయ చిత్రాలనెప్పుడూ చూసివుండరు కనుక వారి కిది కొత్తరకం చిత్రం. మనదేశంలో టెక్నికలర్ నిర్మాణాని కిదే మొదటిసారి గనక మనకూ ఇది కొత్తరకంచిత్రమే. "ఆన్"లో ఉన్న కొత్తదనమల్లా ఇంతే.

ఆగస్టు 7 వ తేదీన కృష్ణా, చిత్రా టాకీస్‌లలో "ఆన్" తమిళతర్జుమా విడుదలైంది. ఆరోజున మధ్యాహ్నం ఆట సమయానికి కృష్ణాటాకీస్ వద్ద ఇసక వేస్తే రాలనట్టు జనం గుమిగూడారు లోపలికి ప్రవేశించటమే కష్టమైంది. ఆట ప్రారంభమై, తెరమీద నిర్మాత, దర్శకుడు మహబూబ్ ఖాన్ పేరు రంగుల్లో కనిపించగానే ప్రేక్షకులు విపరీతంగా చప్పట్లు కొట్టారు. దీన్నిబట్టే తెలుసుకోవచ్చు "ఆన్" చిత్రం ప్రజల్లో ఎంత సంచలనం కలిగించిందీ. ఆట సగమైనప్పటినుంచీ ప్రేక్షకులు అడపాతడపా తప్ప నిశ్శబ్దంగానే చూశారు— లోపల ఏమనుకున్నారో కాని. ఎందుకంటే, "ఆన్" రంగు వేసుకొని వచ్చిన మామూలు స్టంటుచిత్రం ఈ స్టంటు రంగులోనే కాక కథనిండా ఉన్నది.

తంబారాజ్యపాలకునికి రాజ్యశ్రీ అనే సోదరి, షంషేర్ సింగ్ అనే సోదరుడు ఉన్నారు షంషేర్ సింగ్ ఆ రాజ్యంలోకల్లా గొప్ప ఖడ్గప్రవీణుడని ప్రతీతి. అతడొకరోజున తనతో ఎవరైనాసరే కత్తియుద్ధం చెయ్యవచ్చని ఛాలెంజి చేస్తాడు. 'హడా' తెగనాయకుడైన జైతిలక్ తిరిగి ఛాలెంజిచేస్తాడు. కాని అతనితల్లి తమవంశం వారెవరూ రాజవంశీయులపై కత్తి దూయమని ప్రతిజ్ఞపట్టారు గనక కుమారుణ్ణి వారిస్తుంది.

రాజసోదరి రాజ్యశ్రీ తన గుర్రాన్ని మైదానంలో వదిలిపెట్టి దాన్నెవరైనా లొంగదీయగలవారుంటే ముందుకురండని ఛాలెంజి చేస్తుంది. జైతిలక్ ఒక్కడే దాన్ని లొంగదీసుకుంటాడు. రాజుగారు అనుకున్న ప్రకారం తనసోదరిని వివాహం చేసుకోమని జైతిలక్‌తో అంటాడు. కాని జైతిలక్ తనకు ఆమె గుర్రాన్నిస్తే చాలునని చెబుతాడు. అప్పుడు షంషేర్ సింగ్ ఈ అవమానం సహించలేక జైతిలక్‌ను ఛాలెంజిచేసి కత్తియుద్ధం చేస్తాడు. జైతిలక్ షంషేర్‌ను చంపబోతుండగా అతని తల్లి కేకలేస్తుంది. జైతిలక్ ఆగుతాడు. ఆ అదను చూసుకొని షంషేర్ జైతిలక్‌ను పడవేసి తనే గెల్చానంటాడు. కాని జైతిలక్‌ను ప్రేమించిన మంగళ అనే కన్య రాజును ప్రార్థిస్తుంది న్యాయం చెయ్యమని. రాజుగారు రాజ్యశ్రీ గుర్రాన్ని జైతిలక్ కిచ్చివేస్తాడు.

ఆ రాత్రి షంషేర్ సింగ్ తన అన్నగార్ని చంపాలని ప్లానువేస్తాడు. రాజుగారి నమ్మిన బంటొకడు తను రాజవేషం వేసుకొని, తన వేషం రాజుకు వేసి తనే ఆ రాత్రి పొడవబడతాడు. షంషేర్ సింగ్ రాజు చనిపోయాడనే భావించి రాజ్యం వశపరచుకొని ఇష్టం వచ్చినట్టు ఉంటాడు.

ఆ తరవాత రాజ్యశ్రీ తన్నవమానించిన జైతిలక్‌ను ఖైదులో పడవేయించటం, కొరడాలతో కొట్టించటం, చంపటానికి ప్రయత్నించటం, అతడామెను ప్రతిసారీ ఏడిపించటం, చివరి కామె అతని ధైర్యసాహసాలు చూసి అతని ప్రేమపాశంలో చిక్కుకోవటం జరిగి కథ దీర్ఘంగా పరిణమిస్తుంది. షంషేర్ సింగ్ తన మామూలు స్త్రీవ్యసనం మూలంగా మంగళను బలాత్కరించటం, ఆమె మేడపైనుంచి దూకి చనిపోవటం, అదిచూసి జైతిలక్ షంషేర్‌తో మళ్ళీ కత్తియుద్ధం చేయటం, షంషేర్ గాయపడటం, షంషేర్ తన సైన్యాలతో హడా తెగవారిపై పడటం, వారంతా పారిపోవటం, జరుగుతుంది. ఈ సమయంలోనే షంషేర్ తన సోదరి రాజ్యశ్రీ జైతిలక్‌ను ప్రేమిస్తోందని తెలిసిఆమెను స్తంభానికి కట్టివేసి నిప్పు అంటించబోతాడు. జైతిలక్ సరిగా ఆ సమయానికే అక్కడకు వచ్చి షంషేర్‌తో మరొక



"ఆన్" లో మంగళగా నిమ్మి.

**ముగింపు తేది : 23-8-52 పోటీ నెం. 3 ఫలితములు : 30-8-52**

# Rs. 8,000

అంతా సరిగానున్న ఆన్సరుకు.. రు **6,000**
మొదటి రెండువరుసలు సరిగా నున్న ఆన్సరుకు **1 500**
మొదటి ఒకవరుస సరిగానున్న ఆన్సరుకు **500**

ప్రవేశరుసుము : చదరమునకు ఒక రూపాయి చొప్పున మనియార్డరు (**M O**) ద్వారాగాని, క్రాస్ చేయని ఇండియన్ పోష్టల్ ఆర్డరు (**I P. O. Uncrossed**) ద్వారాగాని పంపవలెను ఎన్ని చదరములైనా తెల్లకాగితముపై వ్రాసి పంపవచ్చును

నిబంధనలు. అచ్చుకూపనులు కావలసినవారు రెండణాలు పంపవలెను మా ఆఫీసు ఆన్సరు ది 3-9-52 ఆంధ్ర వారపత్రికనందు ప్రకటించబడును. లేదా రెండణాలు పంపినచో ముందుగా తెలిపించబడును

42 — రు 1-0-0

42 — రు 1-0-0

ఈ చరములో 3 నుంచి 18 వరకు (6, 3, 15, 18, 17, 16, 4, 5, 12, 13, 9, 8, 7, 10, 14, 11) గల అంకెలను వాడి నిలువుగాకాని, అడ్డముగా కాని, ఐమూలలుగాకాని.) ఎటుకూడినా మొత్తం 42 (నలభైరెండు) రావలెను.

ఇందుతో *Money order Receipt* నెంబరు . ..... పంపించుచున్నాను.
*Uncrossed I P. O* ఈ పోటీ నిబంధనలకు ఒప్పుకొందును.

పూర్తిపేరు.. ...... . ........ .... ..
పూర్తి అడ్రసు .. . . . .. .. ... సంతకం, తారీకు.

Address your Entries etc To — The Manager, Kanthikiran, Samalkot

*N B*. పోటి నెం 2-*A* & 2-*B* ఆఫీసు ఆన్సరు వచ్చే ఆంధ్రవారపత్రిక నందు ప్రచురించబడును. విజ్ఞానము కలిగించే చక్కని కథలు, పాటలు, వ్యాసాలు రచయితల వద్ద నుంచి కోరబడుచున్నవి. కాంతికిరన్, సామర్లకోట.

సారి క్షత్రియుద్ధంచేసి అతన్ని చంపి, రాజ్యశ్రీని రక్షిస్తారు. ఇంతకాలం మారువేషంలో వున్న రాజుగారు బయటపడతాడు ప్రజలే పరిపాలకులుగాని తాను కాదని ఆయన ప్రకటిస్తాడు కథ ప్రజాస్వామ్య విజయంతో ముగుస్తుంది

జైతిలక్‌గా దిలీప్‌కుమార్, షంషేర్‌గా ప్రేమనాన్, రాజ్యశ్రీగా నదీరా, మంగళగా నిమ్మీ నటించారు వీరిలో దిలీప్ కుమార్ నటన ఒకటే ప్రశంసనీయంగా వుంది నదీరా గుడ్లు పెద్దవిచేసి తీవ్రంగా చూడటం, నిమ్మీ మొదటినుంచి చివరిదాకా ఉన్నాదిని కాకపోయినా ఉన్మాదినిలాగ నటించటంతప్ప మరేం చెయ్యలేదు సంగీతదర్శకుడు నౌషద్ ప్రతిభ ఒకటిరెండు పాటల్లోమాత్రమే కనిపించింది. మిగతావన్నీ చప్పగాఉన్నాయి ఫొటోగ్రఫీదర్శకుడు ఫరేదూన్ ఇరానీ, కొన్ని చక్కని ప్రకృతిదృశ్యాలు తీశాడు తమిళంలో డబ్బింగ్ నిర్దుష్టంగాగాని, సుస్పష్టంగాగాని లేదని తమిళ ప్రేక్షకులంటున్నారు

ఇక టెక్నికలర్ సంగతి. ఇది మనవారికి ప్రథమప్రయత్నం కనుక ప్రథమ ప్రయత్నంలాగానే వుంది అందుచేత హాలీవుడ్ చిత్రాలతో పోల్చటం మంచిది కాదు ఔట్‌డోర్ దృశ్యాలలో, అంటే, ఆకాశం, మబ్బులు, పచ్చికబీళ్లు, పైర్లు నీళ్లు వీటికి సంబంధించిన వర్ణ సమ్మేళనం చక్కగా ఉంది స్టూడియోలోని సెట్టింగులు కూడా రంగుల్లో అద్భుతంగా ఉన్నాయి కాని మనుషుల మొహాలకు, దుస్తులకు వాడబడిన వర్ణసమ్మేళనం మామూలు కోడక్రోమ్ రంగులకు భిన్నంగా లేదు కథలో భౌతిక వాతావరణం తప్ప మానసిక వాతావరణం వీసమంతైనా లేనందున కలర్ స్కీమ్ నిర్ణయించటంలో ప్రత్యేక శ్రమ తీసుకోనక్కర్లేకపోయింది పాశ్చాత్య చిత్రాల్లో ఒక సన్నివేశంలోని మానసిక స్థితినిబట్టి కలర్ స్కీమ్ నిర్ణయించబడుతుంది (ఉదా — ప్రేమసన్నివేశానికి ఆకుపచ్చ, గంభీర సన్నివేశానికి జేగురు రంగు )

సెట్టింగులు బ్రహ్మాండంగా ఉన్నాయి. 'చంద్రలేఖ' తర్వాత ఇంత పెద్ద సెట్టింగుల చిత్రం చూడలేదు. అయితే ఈ సెట్టింగులు భారతదేశానికి విజాతీయమైనవిగా కనిపిస్తాయి రైతు నాయకుడైన జైతిలక్ ఉండే ఇల్లు జమీందారు భవనమంత ఉన్నది స్వప్నదృశ్యం సెట్టింగుఘనతను చూపడానికే కథలో



"ఆన్"లో రాజ్యశ్రీ గా నదీరా.

ఇరికించబడినట్టుంది. (స్వప్న దృశ్యం ఇప్పుడొక ఫేషన్.)

రాజుగారు అంతకాలం వట్టి పుణ్యానికి అజ్ఞాతంగా ఉండటం, జైతిలక్ ప్రేక్షకుల ప్రశంసకోసమే నన్నట్టుగా మాటిమాటికీ ప్రమాదాల్లో చిక్కుకోవటం, మంగళ సింహాల బోనులో పడటం, రాజ్యశ్రీ కల కనటం, స్టంటుచిత్రంలో ప్రజాస్వామ్యప్రసక్తి ఇవన్నీ వ్యర్థంగా చొప్పించబడ్డాయి.

7వ తేదీ సాయంకాలం మైలాపూర్, వుడ్‌లాండ్స్ హోటల్లో "ఆన్" డిస్ట్రిబ్యూటర్లయిన ఆలిండియా ఫిల్మ్ కార్పొరేషన్ వారు పత్రికా ప్రతినిధులకు అల్పాహార విందుచేశారు. ఈ సందర్భానికి నిర్మాత మెహబూబ్, దిలీప్‌కుమార్, ప్రేమనాథ్, నిమ్మీ, నదీరాకూడా వచ్చారు. ★

## 'ముగ్గురు కొడుకులు' సమీక్ష

జెమినీ స్టూడియోస్ వారు తమిళంలో తయారుచేసిన 'మూన్రు పిళ్లైగళ్' తోపాటు, అదే చిత్రాన్ని తెలుగులో కూడా తయారుచేసి, 'ముగ్గురు కొడుకులు' అని పేరుపెట్టారు కథను కల్పించినవారు జెమినీ స్టూడియోస్ కథారచనాశాఖవారే దర్శకత్వం వహించింది నాగేంద్రరావుగారు. మాటలు పాటలు వ్రాసింది బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు ఈ చిత్రంలో నటించినవారిలో తెలుగువారు కన్నాంబ, జానకి, సూర్యప్రభ గార్లు మాత్రమే. తమిళ చిత్రంలో పాల్గొనకుండా, తెలుగు చిత్రంలో మాత్రమే పాల్గొన్న తార జానకి మాత్రమే

మధ్యతరగతి సంసారంలో వుండే కల

తలు, ఒడుదుడుకులు ఆధారంగా తీసుకొని తెలుగువారు లోగడ తయారుచేసిన 'సంసారం' తెలుగుదేశంలోనే కాక, తమిళప్రాంతంలో కూడా విశేషంగా డబ్బు గణించిపెట్టింది ఈ విషయాన్ని గుర్తించే, జెమినీ స్టూడియోస్ వారు ఇప్పుడు, యించుమించు అదేమాదిరి కథావస్తువుతో యీ చిత్రాన్ని తీశారు 'సంసారం' విడుదల అయినప్పటినుంచీ యిప్పటిలోగా ప్రజల అభిరుచులు మారిపోకుండా వుంటే యీ చిత్రం కూడా చాలా డబ్బు గణించిపెట్టుతుందని చెప్పవచ్చు.

నాగేంద్రరావు, కన్నాంబ, జానకి, శ్రీరాంగార్లు చాలా బాగా తమ పాత్రలను పోషించారు మిగిలిన నటకులలో కూడా ఎవరూ తమ పాత్రలకు అన్యాయం చేయలేదు.

ఈ చిత్రంలో ప్రేక్షకుని మనస్సును కదిలించే ఘట్టాలు, చిత్రం చివరివరకు లేకుండా, మొదటిభాగంలోనే ముగిసిపోయాయి ఇక ఆ తరువాత జరిగే కథ అంతా కూడా మనకు సంబంధించనట్లే తోస్తూవుంటుంది.

పాటలకోసమే ప్రేక్షకులు సినిమాలకు విరగబడుతున్న యీ రోజుల్లో యింత తక్కువ పాటలతో యీ చిత్రాన్ని తయారుచేయబూనటం సాహసమే ఉన్న పాటలైనా, ప్రేక్షకుని మనస్సుల్లో ఆట్టే సేపు మెదిలే రకం కాదు.

సంభాషణలు చాలా సహజంగానూ, సంసారపక్షంగానూ వున్నాయి ఒక్క చోట మాత్రం, తల్లి బొంబాయికి వెళ్తానంటే పెద్దకొడుకు 'ధారాళంగా పోయి రమ్మం'టాడు వూరికిపోయే మనిషిని పట్టుకుని, 'ధారాళంగా' పోయి రమ్మనటం తెలుగువారు ఎరుగరు అది తమిళసాంప్రదాయం. అజాగ్రతగా వున్నందువల్లనే యిటువంటి ప్రయోగం దొర్లివుంటుంది

కథారచనలో కూడా ఒక లోపం వున్నది. బ్లాక్ మార్కెటు లెక్కలు వ్రాయటానికి మనస్సు ఒప్పక, నెలకు రు 500 జీతం వచ్చే వుద్యోగాన్ని అవలీలగా వదిలివేసిన సోమశేఖరం (ముగ్గురుకొడుకుల తండ్రి, గారిలాంటి వ్యక్తి, పెద్దకొడుకు పేద అరుపులు అరిచినంతమాత్రం చేత, రెండోసారి దొంగతనానికి పూనుకొంటాడనటం, ఎంతఅతికించాలని చూసినా అతకటంలేదు.

ఈ సోమశేఖరంగారే, వుద్యోగం పోయి ఎన్నో నెలలు అయి, అప్పులు పెరిగిపోయినతరువాత ఒకనాడు కూర్చుని పెళ్లానికి, ఆవుద్యోగం ఎందుకు ఎలాపోయిందో వివరించినట్లుగా 'ఫ్లాష్‌బాక్'కథ చెప్తారు. అంత సన్నిహితంగా వుండేభార్య మొగుడి వుద్యోగం పోయినవైనం, ఆరు నెలలతరువాత వినవలసి రావటం అసహజం ఉద్యోగం పోవటం ఎలా జరిగిందో ప్రేక్షకులకు చెప్పాలనుకొంటే ఆ 'ఫ్లాష్‌బాక్' ఘట్టమైనా మానివేసి, కథను సాక్షీగా నడిపివుండవచ్చు. లేదా, ఆ 'ఫ్లాష్‌బాక్' వినటానికి, భార్యకాక, మరేదైనా పాత్రను ఆలంబనంగా చేసి వుండవలసింది

ఈ చిత్రంలో సినిమాకంపెనీలు, సినిమాసంగీత బాణీలపై చేసిన విమర్శల వల్ల ప్రేక్షకులకు కావలసిన వినోదం కూడా లభ్యమైంది. మొత్తంమీద యీ చిత్రం చూస్తున్నంతసేపూ ప్రేక్షకుడి మనస్సు మరొక విషయంమీదకు పోదనటంలో సందేహం లేదు. ★

# సినిమా వార్తలు

## హెచ్. ఎమ్. గారి చిత్రాలు

రోహిణీ స్టూడియో అధిపతి శ్రీ హెచ్. ఎమ్ రెడ్డి తెలుగు, అరవభాషలలో తీస్తున్న "ప్రతిజ్ఞ" అనే చిత్రం(వెంజన్స్) సగానికి పైగా (9 రీళ్ళు) పూర్తయింది. ఇందులో కాంతారావు, రాజనాల, సావిత్రి, గిరిజ సారంగపాణి, మధు, రెడ్డిగారు తమ శాంసన్ డెలీలా చిత్రంలో శాంసన్ పాత్రకు బుక్ చేసిన సుదర్శన్ మున్నగువారు నటిస్తున్నారు డైలాగ్సు మల్లాది కృష్ణశర్మ; పాటలు శ్రీశ్రీ; సంగీతం అశ్వత్థామ; కెమేరా డి ఎల్. నారాయణ; డైరెక్షన్ వై. ఆర్. స్వామి

ఇదిగాక రెడ్డిగారు "*Legacy*" అనే సాంఘికచిత్రం కూడా ప్రారంభించారు డైరెక్టరు డి. ఎల్. రామచందర్. ఇందులో కాంతారావు, రాజనాల, సావిత్రి, దొరస్వామి, సూర్యకాంతం, మధు, సుధాకర్, మున్నగువారు నటిస్తున్నారు. డైలాగ్సు కొవ్వలి, పాటలు, శ్రీశ్రీ; సంగీతం అశ్వద్థామ. చిత్రం నాల్గోవంతు పూర్తి అయింది (4 రీళ్లు)

రెడ్డిగారిని "మీ 'శాంసన్ ఎండ్ డలైలా' సంగతేమి చేశా"రని అడగ్గా అందుకు ముఖ్యంగా అవసరమైన సింహం కలకత్తాలో శిక్షణపొందుతున్నదనీ, ఆ శిక్షణ పూర్తికాగానే ఆచిత్రం ప్రారంభించగలమనీ చెప్పారు

రోహిణీ స్టూడియోలో రెండు ఫ్లోర్‌లు నిర్మాణం పూర్తయి, ఆధునిక పరికరాలతో సర్వ సమృద్ధంగా ఉన్నాయి రెంటిలోనూ షూటింగ్ జగుగుతున్నది రెడ్డిగారు నిపుణులతో కూడిన ఒక ఆర్కెస్ట్రానుకూడా సమకూర్చుకున్నారు "మీ స్టూడియోలో మీ చిత్రాలే తప్ప ఇతరుల చిత్రాలకు అద్దెకివ్వరని వదంతిగా ఉన్నది. నిజమేనా?" అనిరెడ్డిగారిని ప్రశ్నించగా, "అటువంట నియమం ఏమీలేదు. ఇప్పటికే కొందరు మా స్టూడియోలో చిత్రనిర్మాణం సాగిస్తున్నారు ఆ వదంతి ఎందుకు వచ్చిందో నాకు తెలియదు," అని సమాధానమిచ్చారు

## "వయారిభామ"

అజంతావారి "వయారిభామ" లో వయారిభామ, "తార" రాణివాసమందిరం షూటింగు ప్రస్తుతం నర్సూ స్టూడియోలో జరుగుతున్నది అది బ్రహ్మాండమైన సెట్టు. లోపల ప్రవేశించగానే, ఆ సెట్టు పరిమాణము, అలంకారము, కళాప్రావీణ్యము ఎంతవాణ్నయినా ముగ్ధుణ్ని చేస్తాయి

"తార" (సులోచనాదేవి) దగ్గిర మంత్రప్రభావంగల మణి వున్నదని తెలిసి దాన్ని ఏదోవిధంగా సేకరించాలని రాజు (సి ఎస్ ఆర్) వెతుక్కుంటూ వచ్చి "తార" మందిరం ప్రవేశిస్తాడు. చిరకాలంగా రాజును ఎలాగైనా తన వలలో వేసుకుందామని చూస్తున్న "తార"కు అవకాశం వెతుక్కుంటూ వచ్చింది. కడకు ఏదోవిధంగా రాజును తన వల్లో వేసుకుంటుంది

ఈ సెట్టుయొక్క ఘనతను పూర్తిగా వినియోగించుకు నేందుకు కెమరామెన్ అజయకార్ సర్వశక్తులూ వినియోగిస్తున్నాడు. శ్రీ పి. సుబ్బారావుగారు డైరెక్టుచేస్తున్న "వయారిభామ" చిత్రానికి ఈ సెట్టు తలమానికముగా వుండగలదు

నాగేశ్వరరావు, ఎస్ వరలక్ష్మి, సి. ఎస్ ఆర్, సులోచనాదేవి ఇందులో ప్రధానమైన పాత్రలు నిర్వహిస్తున్నారు ఈ సెట్టు షూటింగ్ పూర్తికావడంతో వయారిభామ చిత్రం దాదాపు పూర్తిఅయినట్లే భావించవచ్చు.

"వయారిభామ" కథ జానపద చిత్రాల మీద సెటైర్ కనక కథాసంవిధానం కొత్తరకంగా ఉండి విజయవంతం కాగలదనటంలో సందేహం లేదు

* * *

అమెరికన్ మోషన్‌పిక్చర్ ఎసోసియేషన్ చేత ఆహ్వానింపబడిన భారతీయ

(56-వ పేజీ చూడండి)

# ప్రశ్నలు సమాధానాలు

జి యస్ రెడ్డి—కౌజ

వివాహము మానవునకు బంధనము లాంటిది. కనుక మానవుడు వివాహం చేసుకొనుట తన స్వాతంత్ర్యమును కోల్పోవుట యని మా మిత్రుడనుచున్నాడు మీ అభిప్రాయ మేమి?

—ఆ దృష్టితో చూస్తే వివాహమే కాదు, నిత్యజీవితంలో అనేకం స్వేచ్ఛకి ప్రతిబంధకాలుగా కనబడతాయి బ్రతుకే బంధనమని భావిస్తే, దేహత్యాగమే పరమ స్వాతంత్ర్య సిద్ధి

మానవునకు ఏ ఆశయ ముండవలెను?

—ఒకరిపొట్ట కొట్టనక్కర లేకుండా తన పొట్టపోసుకోడం

* * *

ఎమ్ నారాయణరావు—ఆదోని.

"పెళ్ళిచేసి చూడు" అను మాటను ఇంగ్లీషులో ఏమంటారు?

—ఇంగ్లీషులో ఏమనాలో తెలియకనే వాహినీస్టూడియోలో అందరూ ఆ చిత్రాన్ని "పి. సి. సి" (ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కాదు సుమా, అంటున్నారు

* * *

బి విశ్వనాధరావు—కుమ్మరిగడ్డ

నూతనముగా సినిమారంగమందు జేరే స్త్రీపురుషుల నటనా సామర్థ్యము నెటుల గుర్తెఱుంగుదురు

—తెరవెనక పరీక్షించి చూస్తారు.

* * *

పి. వి నాన్—విజయవాడ

ఆంధ్రరాష్ట్రం గురించి ఎన్నికలు పెడితే, సెప్రహూలగాయతు, మన నీలం సంజీవరెడ్డివరకు నిలబడితే ఓడిస్తామని కమ్యూనిస్టు లంటున్నారు! గెలుపు ఎవరిది?

—ఆంధ్రరాష్ట్రం వద్దంటూ ఎన్నికల్లో నిలిచేవా రెవరో ముందు చూడండి. ఆపైన గెలుపుమాట ఆలోచిద్దాం.

* * *

సి శేషగిరరావు—హైదరాబాద్.

చిత్రవిమర్శకులే, చిత్రాలకి దర్శకత్వం వహిస్తే, విమర్శనలకు, వివాదాలకు తావివ్వకుండా తయారుచేసి, ప్రజలకు చిత్రాన్ని అందివ్వగలరా?

—కళావిమర్శ, కళాసృష్టి రెండు వేరు వేరు పనులని తెలియక ఇదివరలో బాబూరావు పటేల్ "ద్రౌపది" చిత్రం తీశాడు మళ్ళీ అప్పటికీ ఇప్పటికీ ఆయన చిత్రనిర్మాణానికి పూనుకోలేదు.

* * *

కె వాణి—కర్నూలు.

సినిమాలు చూస్తే కలిగే లాభాలు ఏమిటండీ?

—మీకు కాలక్షేపం, నిర్మాతకు ధననిక్షేపం.

* * *

పి పి రాజు—భీమవరము.

'సర్రియలిస్టుమూడ్' అంటే ఏమిటండీ?

—అధివాస్తవిక మనస్థితి

* * *

పి సుబ్బారావు—నిడదవోలు

హరిజనోద్ధరణ అని చెప్పి లక్షలకొద్ది ప్రభుత్వం ఖర్చుపెట్టుతున్నదే! మిగతజాతులలో కూటికి, గుడ్డకు మొగం వాచినవాళ్లు లేరనియా? వాళ్ళగతి ఏమిటని?

—సమాజంలో చిరకాలంగా హీనస్థితిలో దిగద్రొక్కి ఉంచబడినవారి సముద్ధరణకు ప్రభుత్వమూ సామాజిక సంస్థలూ ప్రత్యేక కృషిచెయ్యడం అవసరం ఇంక ఇతరుల స్థితి బాగుపడాలంటే దేశం ఆర్థిక స్థితి వృద్ధి కెందాలి ఇందుకోసమే ప్రభుత్వం అనేక ప్రణాళికలు ఏర్పాటు చేసింది.

ప్రభుత్వం లంచం పుచ్చుకునేవారిని, యిచ్చేవారిని కూడా శిక్షిస్తామని ప్రకటంచుతోంది అయితే గ్రామమునసబుకి కరణాకి జీతం రు 23-0-0 కదా! రైతుల దగ్గర ఏమీ పుచ్చుకోకుండగా వారు ఆ జీతాలపై ఎట్లు జీవిస్తారో చెప్పండి? కాబట్టి ప్రభుత్వం వాళ్ళకు కూడా, ఏ రు. 60-0-0 దాకానో జీతం పెంచి, అప్పుడు లంచము పుచ్చుకున్నవారిని శిక్షించుతే బాగుంటుందని నేను అంటూన్నాను మీరు ఏమంటారు?

—లంచాలకీ మామూళ్ళకీ తేడా ఉన్నదని ముఖ్యమంత్రి రాజగోపాలాచారిగారు కూడా ఒప్పుకున్నారు శిక్షవిషయంలో ఈ తేడా గమనింపవచ్చునేమో

* * *

నాగేశ్వరరావు—పెనమలూరు

నిజమైనస్నేహముఎట్లా యుంటుందండి?

—ఊహాతీతంగా ఉంటుంది

నాటకాలలో నటించడము కష్టమా సినిమాలలో నటించడం కష్టమాఅండి?

—నటన చేతకాని వారికి రెండూ కష్టమే.

నటీనటులు పైకి రావలయునన్న ఎవరి అభిమానము గావలయునండీ?

తెరపైకి రావాలంటే ప్రొడ్యూసరు అభిమానం కావాలి కీర్తిలో పైకిరావాలంటే ప్రజాభిమానం కావాలి.

* * *

చంద్రపతిరావు—మాతల

మీ పత్రికలో మిత్రలాభము సీరియల్ పూర్తి కాకుండా మిత్రభేదము ప్రారంభించారు, మిత్రభేదము వ్రాయుట రచయితకు చేతకాకనా? లేక ఏ సాకుతోనో మీరు ప్రచురింపలేదా?

—మిత్రభేదం బొమ్మలువేయటం చేతనైన వ్యక్తికి, మిత్రలాభం బొమ్మలు వేయటం ఏమంత కష్టం కనుక! మిత్రభేదం పూర్తికాగానే మిత్రలాభమూ, దానివెనుక పంచతంత్రంలోని మిగిలిన మూడు తంత్రాలు కూడా యిలానే బొమ్మల సీరియల్ గా ప్రచురించా లనుకొంటున్నాం.

* * *

టి పరమేశ్వరి;—వెంకటగిరి

"గడియారం చెప్పినకథ" చాల వైజ్ఞానికంగాను, వినోదకరంగాను వుంటూంది. ఇంకా యెన్ని వారములు వేస్తారండి? ఆకథ అయిపోతే, అలాంటిదే వేరేకథ వేస్తారా?

—గడియారం కథ చెప్పటం యీ

(56-వ పేజీ చూడండి)



“పరదేశి”లో కారెక్టర్ ఆక్ట్రెస్ అంజలి.

# “అంజామ్” సమీక్ష

సన్‌రైజ్ పిక్చర్సువారి “అంజామ్” హిందీచిత్రం ఈనెల 7 వ తేదీనుండి స్టార్ టాకీస్‌లో ప్రదర్శింపబడుతోంది. ఈ చిత్రంలో మద్రాసు ప్రేక్షకులకుగల ముఖ్యమైన ఆకర్షణ ఏమిటంటే తమిళతార వైజయంతీమాల మొదటి సారిగా ఈ బొంబాయిచిత్రంలో నటించటమే. అందుచేత బొంబాయిలో అంతగా రాణించలేకపోయినా ఈ చిత్రం మద్రాసులో విజయంపొందే అవకాశం ఉన్నది. కథలోగాని, డైరెక్షనులోగాని, పాటల్లోగాని ఎటువంటి గొప్పతనమూ లేకపోయినా చలాకీపిల్ల వైజయంతీమాలను చూట్టానికైనా వెళ్ళే ప్రేక్షకులుంటారు

అశోక్‌బాబు అనే ధనికయువకుడు ఉంటాడు అతని పనల్లా చేతికందిన యువతిని వలలో వేసుకుని చెరచటం శోభా అనే యువతిని కూడా అలాగే వశపరుచుకోబోతాడు కాని ఆమె అశోక్‌ను చెంపమీదకొట్టి అవమానిస్తుంది. అశోక్ ఆమెపై ఎలాగైనా పగతీర్చుకోవాలని ఆమె తండ్రికి డబ్బాశపెట్టి వివాహం చేసుకుంటాడు. శోభా మొదట వివాహానికొప్పుకోదు కాని అశోక్‌చే మోసగింపబడిన యువతుల ఒత్తిడిచేత, అశోక్‌కు బుద్ధిచెప్పాలని, అతన్ని మంచి మార్గానికి తిప్పాలని పెళ్ళికి ఒప్పుకుంటుంది చివరకి శోభా తన మంచితనంవల్ల అశోక్‌ను మంచివాణ్ణిచేస్తుంది.

శోభాపాత్ర వైజయంతీమాల, అశోక్ పాత్ర ప్రేమ్‌నాథ్ నటించారు. శోభా పాత్రకు వ్యతిరేకమైన మీనాపాత్రను కులదీప్ కౌర్, అశోక్‌కు వ్యతిరేకమైన మంచివాడి పాత్రను యాకూబ్ ధరించారు ఈ ఇద్దరూ కథ చివరలో చనిపోతారు ఎవరికీ విచారం కలిగించకుండా. అంటే కథలో వారు ఉన్నా, లేకపోయినా ఒకటే నన్నమాట. మరొక అనవసరమైన పాత్ర దులారీ నటించిన శ్యామపాత్ర. ఈమె అశోక్‌ను మనసారా ప్రేమించి అతను మోసగించటంచేత పిచ్చిదౌతుంది. ఈమె పిచ్చిచేష్టలుచేస్తూ ఉండి ఉండి తెరమీదకి వచ్చి ప్రేక్షకుల జుగుప్సను మాత్రమే పొంది వెళ్ళిపోతూఉంటుంది. తను ప్రేమించిన అశోక్‌ను శోభావశపరచుకున్నదని ఈ శ్యామ పిచ్చిలో శోభానుకత్తితో పొడుస్తుంది వెంటనే ఆమెను పోలీసులు లాక్కుపోతారు ఆమె పిచ్చికి, ఇంకా అనేకమంది యువతుల శీలం పాడుకావటానికి కారణమైన ధనికుడు అశోక్‌మాత్రం సుఖంగానే ఉంటాడు. అతనిలో శోభా కలిగించిన పరివర్తన ఏవిధంగాను నమ్మదగినది కాదు

ఈ చిత్రం డైరెక్టు చేసింది శాంతికుమార్ సంగీతం మదన్ మోహన్. “మేరీ నయ్యా హై మజ్‌ధార్”అనేపాట ఒకటిమాత్రం చాల చక్కగా ఉంది. డాన్సు డైరెక్టరు వైజయంతీమాల ఈమె భరతనాట్యంలో ఉద్దండురాలని ప్రసిద్ధిఉన్నది కాని ఆమె చేసిన, ఇతరులచేత చేయించిన నృత్యాలు మామూలుగా హిందీసినిమాల్లో చూసే మూక నృత్యాలకంటె భిన్నంగా లేవు

విచారపడవలసిన విషయమేమిటంటే, ఈ రోజుల్లో వచ్చే హిందిసినిమాలు మొదటినుంచి చివరదాకా కృత్రిమంగా నడిచిపోతాయి. చక్కని కథలు తీసుకొని, చక్కని సన్నివేశాలను ఊహించి, వాటిని పేలవంగా, నిర్జీవంగా, ప్రేక్షకులను కదిలించకుండా చిత్రించి వదిలివెయ్యటం మామూలైంది. ★

## అల్లుడుగారి ప్రతాపం

(35-వ పేజీ తరువాయి)

పించుకోక దెబ్బమీద దెబ్బగా దెబ్బలు తగిలిస్తూనే వున్నాడు

"నీకే కదట్రా చెప్పేది ?... ఇలాగైతే నీకొక దమ్మిడీ కూడా ఇవ్వను" అని భీమన్న సణుగుతూ వుంటే—

"ఆఁ ... ఏమన్నావురా !... ఒక్క దమ్మిడీ కూడా ఇవ్వవా?... ఎలా ఇవ్వవో చూస్తాగా" అంటూ భీమన్న చేతుల్ని మెలి తిప్పటం మొదలెట్టాడా ముసుగు మనిషి. భీమన్నకు ప్రాణం పోయేట్లుంది. 'లబోదిబో' అని మొత్తుకుంటే, అత్తాగారు మామగారు ఎక్కడ విని నవ్వుకుంటారోనని, మెల్లిగా ఆముసుగు మనిషి చెవులో "అబ్బబ్బబ్బా...నొప్పెడుతూందిరా... మెల్లిగా త్రిప్పరా...ఇంతకీ! నువ్వెవ్వరా గొంతు ఆనవాలు పట్టలేక పోతున్నానూ, మిగతా వాళ్లేరీ? ఒక్కడివే వచ్చావేం ?" అని హీన స్వరంతో అడిగాడు.

"మిగతా వాళ్లెవ్వరైతే నీకెందుకూ, నేనెవడైతే నీకేమీ... ఇనప్పెట్టె తాళాలు ఎక్కడ దాచావో చెప్పు ఊఁ...చెప్తావా లేదా" అంటూ భీమన్న చేతుల్ని ఇంకా గట్టిగా మెలి త్రిప్పాడు అప్పటికి గానీ వాడు తన స్నేహితుడుకాడనీ, ఎవరో నిజమైనదొంగే ననీ తెలియరాలేదు భీమన్నకు.

ఎంతసేపుగా అక్కడ నిలుచోని చూస్తూందో ఏమో కానీ, "అయ్యో !... ఆయన్ను కొట్టితే నీకేం వస్తుదయ్యా ... నీ కేమైనా కావాల్నస్తే మమ్మల్నడగాలి కానీ" అంటూ భీమన్న అత్తగారు అడ్డురాబోయే సరికి, దాదాపు గుండె ఆగినంత పనైంది భీమన్నకు.

"ఉష్‌ష్ ... గట్టిగా కేకెట్టావంటే, చూస్తో చేతులో ఏముందో- వీడి ప్రేగులు చీల్చేస్తాను...రక్తం త్రాగేస్తాను" అని బొడ్డులోనించి కత్తిని తీసి చూపించాడా ముసుగు మనిషి.

భీమన్నకు కాళ్లక్రింద భూమి కంపించిపోయి నట్లయింది ఆ అవమానంతో పాటు కోపం కూడా రెచ్చిపోయింది. ఏం చేయటానికీ తోచక ఉన్నట్లుండి అమాంతంగా ఆదొంగ చెంపమీదకి చెయ్యి విసిరాడు. ఏ మరుపాటున వున్నాడేమో కానీ, ఆ దెబ్బకు ఎగిరి అవతల పడ్డాడా దొంగ. వాడి చేతిలోని కత్తిజారి దూరంగా పోయి పడిపోయింది. ఆ దొంగకు కూడా కోపం ఆగిందికాదు. "ఆఁ...!" అని గర్జిస్తూ, లేచి భీమన్నపై పడ్డాడు. ఆ గర్జనకే స్పృహతప్పి, ఆ రౌద్రాకారాన్ని చూడక మునుపే మూర్ఛిల్లి పోయాడు భీమన్న. ఇంతలోకే— భీమన్న మామగారు ఎలాగో గొంతు పెకలించుకొని "దొంగలు- దొంగలు" అని పెద్దగా పొలి కేకలు పెట్టాడు.

ఎంత సేపటి్నుంచో, దొడ్డివైపున కాచు కూర్చొనున్నారేమో, దొంగలు - దొంగలని" భీమన్న మామగారు కేకపెట్టే సరికల్లా, అక్కడ ఏం జరిగిందో ఏమిటో తెలియక పోయినా కూడా, వెంటనే భీమన్న స్నేహితులు ఎనమండుగురూ ఇంట్లోకి ప్రవేశించారు. వాళ్లల్లో ఒకడు టార్చిలైట్ వెలిగించాడు. ఆ దృశ్యాన్ని చూసి అందరూ తెల్లబోయారు. ఆ నిజమైన దొంగ యింతమంది వచ్చి పడటం చూసి నిలువునా

కంపించిపోయాడు.

నలుగురూకలిసి దొంగను ఒక గుంజకు కట్టేశారు. ఎవరిచేతిమురద తీరేదాకా, వారు వాడి వంటినిండా గుద్దులవర్షం కురిపించారు.

ఈలోగా – ముందు చిట్టెమ్మ, తరువాత అత్తగారు, ఆ తరువాత మామగారు, ఒకరితరువాత ఒకరుగా మూర్ఛపడివున్న భీమన్న దగ్గిరకు పరిగెత్తారు. ముగ్గురుకలిసి భీమన్నను తీసుకొచ్చి మంచంమీద పడుకోపెట్టి ఒకరినిమించి ఒకరు ఆయనకు సకలోపచారాలు చేశారు. కొంతసేపటికి భీమన్న తేరుకొన్నాడు.

ఈ లోగా యిరుగుపొరుగుల వారికందరికీ యీవార్త తెలిసింది. వాళ్ళంతా లాంతర్లు పుచ్చుకొని వచ్చి, భీమన్న మామగారిని పరామర్శలుచేశారు. వచ్చిన ప్రతి మొగవాడికీ భీమన్న మామగారు, తన అల్లుని ధైర్యసాహసాలను తెగ వర్ణించిచెప్పాడు. అతని అత్తగారయితే, పనిగట్టుకు పుల్లమ్మ యింటికి, ఎల్లమ్మయింటికి వెళ్ళి అల్లుడి గొప్పతనం నోరు నొప్పి పుట్టేదాకా చెప్పిచెప్పి, తెగమురిసి పోయింది. చిట్టెమ్మమాట అసలు చెప్పనే అక్కరలేదు. ఆవిడ తన చూపులతోనే భీమన్నగారి బలపరాక్రమాలను ప్రశంశించింది. భీమన్న బ్రతుకు సార్థకమైంది. ★

# నాగమణి చదువు

(19-వ పేజీ తరువాయి)

యడ్‌లో చేసి చూపించండి అన్నారు బెల్ కొట్టారు సైన్సు పీరియడ్ మాష్టారు సెలవు పెట్టారు. "ఈవేళకి మిమ్మందరినీ ఇంటకి వెళ్ళమని హెడ్‌మాష్టారు చెప్పారు" అని ప్యూన్ చెప్పాడు. మొగపిల్లలంతా ఎగిరి గంతేశారు అందరూ ప్లేగ్రౌండులో కెళ్లి ఆడుకొంటున్నారు క్లాసులో ఎనిమిది మంది ఆడపిల్లలు మాత్రం మిగిలారు

"ఏంచేస్తున్నారు? ఈపీరియడ్ మీకు సెలవేగా" అంటూ మేష్టారమ్మ వచ్చింది అందరూ లేచి నిల్చున్నారు మణి కుర్చీ తెచ్చి మేష్టారమ్మ దగ్గర వేసింది నవ్వుతూ కూర్చుంది మేష్టారమ్మ. అందరి మొఖాలూ చిన్నపోయాయి. మణి ముఖంలో కళాకాంతి లేకపోడం చూసి బాధపడింది ప్రభ

"అమ్మగా రేదో పనిమీద వచ్చారే" తమాషాగా అంది మణి

"మేష్టారమ్మ చెప్పింది ప్రభా! నీవు చెప్పావే మొన్న ఇంటర్‌వెల్‌లో టీచర్స్ రూమ్‌లో ఆ "నాటకం" వేయించాలనుకుంటున్నాను దాంట్లో మీరు ఇద్దరూ రాణిస్తారని నాకు తెలుసు ఈ నాడు ఆడపిల్లలంతా చదువు నేర్చుకోవాలి. ఆడవాళ్ళకు చదువందుకు అనే మాట రూపుమాపాలి దాన్నే నాటకంగా వేద్దాం ఏం? మునుపు వేసిన నాటకాలు రక్తికట్టలేదు ఈ నాటకం ఆకర్షించేట్టుగా తయారుచేయాలి మీ అభిప్రాయం చెప్పండి అన్నీ నేను రెడీ చేస్తాను, మీరు స్టడీ చెయ్యండి రేపు చెప్తాను ప్రోగ్రాం"

మేష్టారమ్మవెళ్లిపోయింది మణికిమరచిన గాధ జ్ఞాపకానికొచ్చింది తన ఇంటిదగ్గర జరిగేదేగా? మళ్ళీ ఇంటికిపోతే ఏం జరుగుతుందో, అనుభవం వుంది గనుక ఆ నాటకంలో తను తప్పక రాణిస్తుంది అసలు తనకంత స్వేచ్ఛ ఎక్కడిది? మణి ఆలోచనా తరంగాలలో కొట్టుకుపోతోంది. మాకేంపని అనుకుంటూ అందరూ వెళ్ళిపోయారు



ప్రభ మణిని పరీక్షించి జాలిగా "నీ వేదో బాధపడ్తున్నావ్ మణీ! నాకు చెప్పవూ" అంది

"నే నేం బాధపడ్డం లేదే" అంది చిన్నగా నవ్వుతూ "నీ కలా కన్పడుతున్నానా ప్రభా"

"నువ్వు నాదగ్గర దాచిపెట్టాలని చూస్తున్నావు నాకు చెప్పవా మణీ"

తను బాధపడ్డమేగాక తోటి స్నేహితురాల్ని కూడ కష్టపెట్టాలిసొచ్చినందుకు చాల విచారమేసింది మణికి తనంటే ప్రభకు అంత ప్రేమ ఎందుకో? వాళ్ళ అక్కయ్యకూడా తనను ఎంత ప్రేమగా చూస్తుంది! వీళ్ళకు చెప్పక, తన మనోవ్యథ నెవరికి చెప్పాలి? బంధువులైనా నమ్మకూడదు కాని, స్నేహితుని నమ్మవచ్చు అని తన తల్లి ఎన్నిసార్లు చెప్పలేదు!

"నా చదువు గురించే ఈ బాధ. ఇంట్లో నా చదువుగురించి పెద్దగోల జరుగుతోంది మా నాన్న నన్ను చదివించాలంటున్నారు మా నాయనమ్మ మాత్రం నన్ను చదవనీయకూడదని పట్టుబట్టి నన్ను బాధపెడ్తోంది. మా అమ్మ మాన్పించడమా చదివించడమా అని సంకోచిస్తోంది నన్ను చదువు మాన్పిస్తారని భయంగావుంది ప్రభా నన్నే చదువు మాన్పిస్తే నీవు నన్ను మర్చిపోతావా?"

కళ్లలో నీళ్లు జలజలారాలిపోతున్నాయి.

"ఏమిటాపిచ్చిమాటలుమణీ? నిన్ను మరచిపోగలనా, నిన్ను చూడకుండా వుండగలనా నీవలా దుఃఖపడుతూంటే నేను చూడలేను మణీ"

మణిచెప్పింది, "నేను బాగాచదివి, స్త్రీల బానిసత్వాన్ని బాపి అందరూ చదుకోవాలని ప్రచారంచేసి, సంఘంలోని అజ్ఞానాన్ని నిర్మూలించాలనుకున్నాను కాని వీళ్లు అవకాశం యివ్వలేకున్నారు నా ఆశలన్నీ నాశనమయ్యాయి నా గాలి మేడలు కూలిపోయ్యాయి నువ్వే నా ఆదర్శ స్నేహితురాలివి ప్రభా"

"నాకు తెలుసు మణీ" నీ మనసు మార్చుకోకు నేనూ మా అక్కయ్య నీకు తోడ్పడతాము నీవు నాకంటె చిన్నదానివైనా, నీలోని భావాలు నాకంటె పెద్దవి నీవు బాధపడితే లాభం లేదు ఓర్పుతో అన్నికష్టాలను నేర్పుతో ఎదుర్కొని సంఘాన్ని బాగుచేయాలి మణీ"

బెల్ కొట్టారు మణి, ప్రభ పుస్తకాలు తీసుకుని వీధిలోకొచ్చారు ఆలోచిస్తూ నడచిపోతుంటే ప్రభ యిల్లు వచ్చింది ప్రభ వెళ్లిపోయింది మణి నెమ్మదిగా నడుస్తూ ఇల్లు చేరింది.

మురళి బలే సంతోషంగా, "అక్కయ్యా, నీకు ఫిడేలు తెచ్చారే నాన్నగారు! రేపట్నించీ మాష్టారుచేత ఫిడేలు నేర్పిస్తారుట అమ్మ పిండి వంటలు చేసిందే" అంటూమణికి స్వాగతమిచ్చాడు

"ఉన్న చదువుకి ఇంత రాద్ధాంతమవుతోంది ఇంక ఫిడేలు తెస్తారు! అంతా అబద్ధం" మణి పుస్తకాలు టేబుల్ మీదపెట్టి కుర్చీలో కూర్చుని తల టేబుల్ మీదఆనించి కూర్చుంది మురళి మంచినీళ్ళు తెచ్చిఅక్కకిచ్చి వేరె కుర్చీలో కూర్చుని, అన్నాడు. "నిజంగానే అక్కయ్యా నాన్నగారు నీ సంగతి ఎత్తితే వేరే రూమ్‌చూసి చదివిస్తానన్నారు ఆమాట వినేసరికి నాయనమ్మ కుక్కిన పేనులా వుండిపోయిందే! అమ్మా, నాన్నా నువ్వేడ్చినందుకు దిగులుపడ్డారే నన్నించే నీకు ఫిడేలు వచ్చిందే నాకు బాగా పాడి వినిపిస్తావుకదూ" సంతోషంతో చెప్పేస్తున్నాడు మురళి

మణి హృదయంలో దుఃఖం తొలగి సంతోషం చేరింది ఆశ్చర్యంగా సరస్వతీదేవి పటంచూసి, "మురళీపటం ఎప్పుడు కట్టించారురా?" అంది.

"ఫిడేలుకొనటానికెళ్లేటప్పుడు పటం తీసుకెళ్లి అద్దంవేయించి తెచ్చారే రావే నాన్నగారి గదిలోకెళ్లి ఫిడేలు చూద్దాం" మణిని లాక్కుపోయ్యాడు నాన్నదగ్గరకు మురళి

"చెప్పకుండానే పోయావేమ్మా? ఈరోజు నీకోసం ఫిడేలు తెచ్చాను, రేపట్నించీ నేర్చుకుందువుగాని ఏవేవో వాళ్లు వాగుతూంటే నీ వెందుకమ్మా బాధపడడం? వెర్రిదానా, నేనుండగా నీ చదువు మాన్పిస్తానా?" కూతుర్ని చూసి అన్నారు రామారావు

మణి ఫిడేలుచూసి ఆశ్చర్యపోయింది వృధాగా బాధపడ్డానే అనుకుంది ప్రక్కనే కుర్చీలో కూర్చుని, "నాన్నగారూ మా మేష్టారమ్మ మాచేత నాటకం వేయిస్తానంటున్నారు నేను నాటకంలో పాత్ర వెయ్యడానికి అమ్మావాళ్లు ఒప్పుకుంటారో లేదో" నాన్న ఏమంటాడో అనుకుంటూ, నేలనురాస్తూ అడిగింది మణి

"వాళ్లనడానికీ, నాటకంలో పాత్రవేస్తే తప్పేముందమ్మా. వాళ్ల మాటలకేం. నా అభ్యంతరం లేదు. కృష్ణమూర్తిగా రమ్మాయి సూర్యప్రభకు చెప్పేమాష్టారే నీకు ఫిడేలు నేర్పేది. నేను పార్కు కెళ్ళొస్తానుమణీ" అంటూ రామారావుగారు పైకండువా వేసుకుని వెళ్లిపోయారు.

మురళి, మణి అమ్మ దగ్గర కెళ్లి పీట వేసుకుని కూర్చున్నారు. జయమ్మ

రెండు ప్లేట్లలో పకోడీలు, జాంగ్రిలు తెచ్చి పెట్టింది. సంతోషంగా మణి, మురళి తిని వేపచెట్టుకింద ఆడుకొంటున్న పిల్లలదగ్గర కొచ్చారు. మురళికూడ ఆటల్లో చేరాడు. తోట్టిలోవున్న గులాబీమొక్క పువ్వులు పూసిందేమో అని చూసింది మణి. పువ్వులులేవు వాళ్ళ ఆటలుచూస్తూ నిల్చుంది. భారతి "అక్కా, అక్కా" అంటూ చేతులెత్తుతోంది మణి భారతి నెత్తుకుని, గదిలోకొచ్చి పాటలు పాడు కుంటోంది ఉల్లాసంగా స్నానంచెయ్యమని చెప్పడానికొచ్చిన జయమ్మ మణి సంతోషంగావుండడం చూసి మురిసిపోయింది.

మరుచటి రోజే ఫిడేలుపాఠాలు ఆరంభమైనాయి. ప్రారంభోత్సవానికి ప్రభనీ, వాళ్లఅక్క సుందరినీ, తరవాత మేష్టారమ్మనీ ఆహ్వానించింది మణి జయమ్మ అందరికీ కాఫీ ఫలహారాలు ఇచ్చి మర్యాద చేసింది. హాల్లో అందరూ కుర్చీల్లో కూర్చున్నారు "ఆనాటకమేమిటో చెప్పండి అమ్మగారూ" అంది మణి. మేష్టారమ్మని.

"ఆనాటకం పేరు 'నాగమణి' చదువు

ఈ నాటకం మీలాంటి గరల్స్ కు చాలా ఉపయోగకరమైంది. ఈ నాటకం నిన్ను గురించే వెయ్యాలని బుద్ధి పుట్టింది. నీ విషయం సూర్యప్రభ చాలాసార్లుచెప్పింది. ఇప్పుడు నీకొకష్టం తీరిపోయింది. కాని, నీలాంటివాళ్లు ఇంకా ఎంతమందో బాధ పడుతున్నవాళ్లున్నారు వాళ్ళకోసమైనా మనం పాటుపడాలి హెడ్ మాష్టారుగారు వచ్చేఆదివారం నాటకం జరిపేందుకు ప్లాను వేశారు రేట్లు తేలికగా ఉండాలన్నాను. లేకపోతే అందరూ చూడలేరు. కథ సారాంశమేమిటంటే; ఒక బాలిక చదువుకోవాలనే కుతూహలంతో స్కూల్లో ప్రవేశిస్తుంది. ఇంట్లో నాయనమ్మ, మేనత్త, ఇరుగుపొరుగువాళు అడ్డం పెడ్తారు తల్లి కూతురి కోర్కె తీర్చలేక, అత్త, ఆడబిడ్డల పోరు పడలేక బాధపడ్తుంది. ఓర్పుతో అలా కష్టపడుతూ ఫస్ట్ మార్కులు తెచ్చుకుని, జీతంలేకుండా చదివి, ఆపైన దేశసేవచేసి ప్రఖ్యాతి తెచ్చుకుంటుంది ఈ కథలో నాయికపాత్ర నువ్వే ధరించాలి సూర్యప్రభ తల్లిపాత్ర, సుందరి ఆడబిడ్డపాత్ర, లలిత, రాధ, ఇరుగుపొరుగువాళ్ల పాత్రలు, హెడ్ మాష్టారు, స్కూలు మాష్టారు పాత్ర, నేను నాయనమ్మ పాత్ర, మీ క్లాస్ మేట్సు అందరూ స్కూలుపిల్లల పాత్రలువేయడానికిమాష్టార్లంతా ఏర్పాటు చేశాము. మీరందరూ బాగానటిస్తే తప్పక నాటకం రక్తి కడుతుంది. సమాజంలోని వక్రభావాలు పోతాయి. గరల్స్ హైస్కూల్స్ వృద్ధిపొందుతాయి." మేష్టారమ్మ చెబుతూంటే అందరూ శ్రద్ధతో విన్నారు. సమ్మతిని తెల్పారు.

ఆదివారంనాడు సాయంకాలం స్కూలంతా ప్రేక్షకులతో నిండిపోయింది. కృష్ణమూర్తిగారు, సుందరి, జయమ్మ, మంగమ్మ, రామారావుగారు, వుచితంగా వేంచేశారు అనుకోకుండాస్కూలు ఇన్స్పెక్టరుగారు వచ్చారు నాటకం వేస్తున్నారని తెలిసి చాల సంతోషించారు. స్కూలు అభివృద్ధికై పాటుపడుతున్న మాష్టర్లను చాలా మెచ్చుకున్నారు మాష్టర్లంతా ఇన్స్పెక్టరుగారికి మర్యాదలు చేశారు "నాగమణి చదువు" నాటకం ఆరుగంటంకు మొదలుపెట్టారు. తెరవిడిపోయింది కథానాయకి మణి పుస్తకాలు చేతబట్టి దిగులుగా కూర్చున్నట్లుగా మొదలయింది. నాయనమ్మ ఈసడింపులు, మేనత్త ఎత్తిపొడుపులు, ఇరుగుపొరుగుల గుస గుసలు, గోల, మనసులోని బాధను ఓర్చుకుని, శ్రద్ధతో చదువుతున్న ఆ అమ్మాయి బాధను మణిస్పష్టంగా నిరూపించి, ఆబాలగోపాలం మనసును కరిగించింది మణిని అర్థంచేసుకో లేకపోయాను కదా అని పశ్చాత్తాప పడింది మంగమ్మ మంగమ్మలాంటి వాళ్ళందరో బుద్ధి తెచ్చుకున్నారు. మేనత్త గయ్యాళితనం బాగా చూపింది సుందరి. నాయనమ్మ కోపాన్ని ఈర్ష్యను తెలిపింది మేష్టారమ్మ. కూతురికోర్కె తీర్చలేక బాధపడ్తున్నట్లుగా నటించింది ప్రభ హెడ్ మాష్టారికి, స్కూలుమాష్టారు పాత్ర అలవాటే నాటకం చిన్నది గనుక పదిన్నరకి పూర్తయింది నాటకంలో పాత్రధరించినవాళ్లంతానమస్కరించారు ప్రేక్షకులకు.

తరవాత ప్రభా, మణీ ఫిడేలు వాయించారు ప్రేక్షకులంతాహర్షధ్వనులు చేశారు ఇద్దరికీస్కూలు ఇన్స్పెక్టరుగారు బంగారు పతకాలు బహుమతి నిచ్చారు కూమార్తెల ప్రజ్ఞను చూసి సంతోషంతో కృష్ణమూర్తిగారు, రామారావుగారు, నాగమణికి, సూర్యప్రభకు పూలమాలలు వేశారు కూతురి ప్రతిభను చూసి జయమ్మ, మనుమరాలి చలాకీతనాన్ని చూసి మంగమ్మ, చెల్లెలి నేర్పును చూసి సుందరి మురిసిపోయారు మేష్టారమ్మ స్టేజీ ఎక్కి మణి ప్రభలను మెచ్చుకుంటూ, తమ స్కూలుకు పేరుతెచ్చారంటూ ఒక చిన్న ఉపన్యాస మిచ్చి ఆశీర్వదించింది. ఇదే "నాగమణి చదువు" నాటకము. ★

## సినిమా వార్తలు

(48-వ పేజీ తరువాయి)

ఫిల్ము ప్రతినిధుల సంఘం సెప్టెంబరు మొదటి వారంలో, బహుశా, 2 వ తేదీన బొంబాయి నుండి బయలుదేరవచ్చునని తెలుస్తోంది. బొంబాయి, బెంగాల్, మద్రాసు ఫిల్ముపరిశ్రమ ప్రతినిధులతో కూడిన ఈ సంఘం హాలీవుడ్‌లో చిత్ర నిర్మాణవిధానాన్ని పరిశీలించి వస్తారట. ఈ సంఘంలో వైజయంతీమాల కూడా ఉండవలసింది కాని ఇప్పుడామె మాని వేసింది. ఆమెవెంట గార్డియన్‌గా మరొకర్ని కూడా తీసుకువెళ్లాలని ఆమె తండ్రి పట్టుబట్టడం, ప్రతినిధులసంఘంవారందుకు ఒప్పుకోకపోవటంచేత ఆమె ప్రయాణం మానివేయటం జరిగింది. దక్షిణదేశపు తారగా శ్రీమతి సూర్యకుమారి ఈ సంఘంతో వెళ్ళవచ్చునని వినికిడి.

*   *   *

జయంతీ పిక్చర్స్ లిమిటెడ్ అని కొత్తగా ఒక కంపెనీ స్థాపింపబడిందనీ, వీరు త్వరలో ఒక చిత్రం నిర్మించనున్నారనీ తెలుస్తోంది. మేనేజింగ్ డైరెక్టరు పి. ఎస్. రెడ్డిగారు. ఆ చిత్రానికి శ్రీ బొమ్మకంటి సుబ్బారావు కథ వ్రాసి యిచ్చారు. శ్రీ కె. వి. రెడ్డి డైరెక్టు చేస్తారనీ, కొద్దినెలల్లో సెట్సమీదికి వెడతారనీ కూడా తెలుస్తోంది



## ప్రశ్నలు - సమాధానాలు

(49-వ పేజీ తరువాయి)

సంచికతో ఆపేసింది. మళ్లీత్వరలో నే యీ మాదిరి కథలు వినగలరు.

*   *   *

కె. సత్యమూర్తి — భీమవరం.

"కథ, కథానిక, స్కెచ్-నాటిక, నాటకం-గేయం, గీతం"-వీటికిగల తేడా లేమిటో తెలియజేస్తారా?

—కథ అంటే పెద్దదికావచ్చు చిన్నది కావచ్చు; నవల కూడా కథే. కథానిక అంటే చిన్నకథ. ఇందులో కొద్దిమంది పాత్రలు, ఒకటి రెండు సంఘటనలు ఉంటే చాలు. ఆ సంఘటనకు అవసరమైనంతవరకే పాత్రలస్వరూపం చిత్రించాలి. స్కెచ్‌లో సంఘటనలు కూడా అక్కరలేదు. నాటకంలో అనేకఅంకాలు, దృశ్యాలు ఉంటాయి. నాటికలో ఒక అంకంగాని, దృశ్యంగాని ఉంటే చాలు. గేయానికి గీతానికి తేడాలేదు.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras.

త్వరలో విడుదల!

నేషనల్ ప్రొడక్షన్స్

# సింగారి

(తెలుగు)

లలిత, పద్మిని, రాగిణి, T.R.రామచంద్రన్, V.K.రామస్వామి
S.V.సహస్రనామం, D.బాలసుబ్రహ్మణ్యం, T.K.రామచంద్రన్

సర్వహక్కులు

కుమరవేల్ పిక్చర్స్, మద్రాసు.7.

డిస్ట్రిబ్యూటర్లు:

ఆంధ్ర: ఆంధ్ర ఫిలిమ్ సర్క్యూట్, గాంధినగర్, విజయవాడ. * సీడెడ్ జిల్లాలు: జీవన్ ఫిలిమ్ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ, గుంతకల్లు * నైజామ్ స్టేట్: బాక్సు ఆఫీసు పిక్చర్సు, కింగ్సువే, సికిందరాబాద్. * చిత్తూరు, ఉత్తర ఆర్కాట్, దక్షిణ ఆర్కాట్, చెంగల్పట్టు: కుమరవేల్ పిక్చర్సు, మద్రాసు-7.

త్వరలో వస్తూంది!

విశాలాంధ్రలో



ఈస్టిండియా వారి

# సంక్రాంతి





కొడుకులు దుర్మార్గులైనా
సన్మార్గులైనా కడుపులో పెట్టుకొని
బాధపడిన కన్నతల్లి కథ





డైరెక్టర్. సి. పుల్లయ్య
ప్రొడ్యూసర్. సుందర్‌లాల్ నహతా